విశ్వసాహిత్యమాల 62.

# ఆంధ్రుల చరిత్ర



గ్రంథకర్త:
శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం, ఎం. ఏ.
లెక్చరర్, ఉస్మానియా కళాశాల, వరంగల్.

1955 డిసెంబరు.



విశ్వసాహిత్యమాల - రాజమండ్రి

# ఆంధ్రుల చరిత్ర

# ANDHRULA CHARITRA

by

K. BALENDU SEKHARAM, M. A.,

ప్రథమ ముద్రణ 1944.

ద్వితీయ ముద్రణ 1955.

మెజెస్టిక్ ప్రెస్, రాజమండ్రి.

రు. 1-8-0 1000 ప్రతులు.

# తొలి పలుకు

మన దేశచరిత్రి రచించుటకు వలయు సామగ్రి నేటికిని యింకనూ సమగ్రంగా లభించడంలేదు. ఇంతవరకు దొరకిన ఆధారములను పరిశీలించి, వానినుండి ఆంధ్రుల చరిత్రను కూర్చుటకు శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం ఎం. ఏ. గారు ప్రయత్నించి, 1944 లో యీ గ్రంథమును వ్రాసిరి. హైద్రాబాదులోని నిజాం రాష్ట్రి ఆంధ్రసారస్వత పరిషత్ వారు దీనిని తమ ప్రథమ కుసుమముగా 1944 డిసెంబరులోనే ప్రచురించిరి.

ఇప్పు డీ రెండవ ముద్రణమును తీసికొనివచ్చుటకు విశ్వసాహిత్యమాలకు అవకాశం యిచ్చినందుకు శ్రీ బాలేందుశేఖరంగారికి కృతజ్ఞులము. గత పదేండ్లుగానూ మన దేశచరిత్రలో జరిగిన ప్రధానసంఘటనలనుకూడ పొందుపరచి 'తుది పలుకు'గా వ్రాసి, యీ గ్రంథమును సమగ్రమొనర్చిరి. గత పదేండ్లలోనూ అదనంగా లభించిన చారిత్రికసామగ్రిని సేకరించి, తదనుగుణ్యమైన మార్పులు, చేర్పులు, కూర్పులు గావించుటకై గ్రంథకర్త ప్రయత్నించిరి. గాని అందుకు గావలసిన వ్యవధి చాలనందుననూ, ఈ గ్రంథముకు త్వరలో రెండవ కూర్పు తీసికొని రావలసివచ్చుటచేతనూ, ఆ మార్పులను రాబోవు ముద్రణములో గావించెదమని వ్రాయగా అంగీక

రించితిమి. సహృదయులైనవారు యిందలి లోపములను బుద్ధిపూర్వకమైనవిగా భావించక, గుణములనే గ్రహించవలెనని ప్రార్థన.

ఈ పుస్తకములో హిందూదేశ పటమును, దక్షిణ హిందుస్థాన పటమును, ఆంధ్రరాష్ట్ర పటమునుకూడ పొందు పరచితిమి. గ్రంథస్థవిషయపఠనమునకై ఈ దేశపటము లత్యంతోపయుక్తములని వేర జెప్పవలెనా ?

ముందుకూర్పులో దీని నింకనూ సర్వాంగసుందరముగా చేయు నవకాశమును ఆంధ్రమహాజనులు మా కొసంగుదురు గాక యని కోరుచు యింతతో విరమించుచున్నాము.

దేశచరిత్రలు, ప్రాచీన నాగరకతాసంస్కృతులుగూర్చి మరికొన్ని గ్రంథములుకూడ తేదలచియున్నాము. తదనుగుణ్యముగా 'యూదుల చరిత్ర' అను గ్రంథమునుకూడ వెలువరచితిమి. సహృదయులైన ఆంధ్రపాఠకలోకం యీ గ్రంథముల నాదరింతురని ఆశింతుము. సెలవు.

30-12-1955 }
రాజమండ్రి. }

మహీధర జగన్మోహనరావు
సంపాదకుడు.



# విషయసూచిక




భారతదేశము-భాషాప్రయుక్త విభాగములు.

# ఆంధ్రుల చరిత్ర

## ప్రాచీన యుగము

### ఆంధ్రుల చరిత్ర — దాని ప్రయోజనము

ఆంధ్రు లెల్లరకును ఆంధ్రజాతీయ చరిత్రను తెలిసికొనుట మిక్కిలి యావశ్యకము. ప్రతిమానవునికిని తన పూర్వు లెట్టివారో, వారెట్టి ఘనకార్యముల గావించిరో తెలిసికొనుటకు కుతూహలముండుట సహజము. అట్లే విజ్ఞానవంతుడైన ప్రతి యాంధ్రుడును తన దేశము యొక్కయు, దేశీయుల యొక్కయు పురాతనచరిత్ర యెరుంగ గోరుట సహజము కాని దేశచరిత్రను పఠించుటలో మానవు లందరి యుద్దేశ్యమును, ఒక్కటిగ నుండజాలదు. కొందరు సత్యాన్వేషణ దృష్టితో చరిత్రమును పఠింతురు. మరికొందరు చరిత్రను తెలిసికొని పూర్వకాలములో మా దేశీయు లెన్నెన్నియో ఘనకార్యములను కావించిరని దంభోక్తులు పల్కుటతో మాత్రము తృప్తిచెందుదురు. కాని చరిత్రపఠనమునందలి ముఖ్యోద్దేశ్యము ఈ రెంటిని మించి యున్నది. మన దేశీయులు పూర్వయుగములో నెట్టి నాగరికతను, విజ్ఞానమును, రాజకీయౌన్నత్యమును సంపాదిం

చిరో యెరింగి అంతకు మించిన నాగరికతను, విజ్ఞానమును, రాజకీయౌన్నత్యమును సంపాదించి దేశఖ్యాతిని పెంపొందింప వలయునను ఉద్దేశ్యముతో చరిత్రను పఠించుట సక్రమమగు పద్ధతి. కొన్నికొన్ని సందర్భములలో ఒక ప్రాచీనజాతి కారణాంతరముల వలన హీనస్థితికి లోనై, కీర్తి ప్రఖ్యాతులు లేకుండ పడియున్నప్పుడు, అట్టి జాతియం దాత్మ విశ్వాసము, కార్యదీక్ష, యశోసంపాదనాభిరుచి మున్నగు గుణముల నుద్దీపింప జేయుటకై చరిత్ర పఠనముకంటె శ్రేష్ఠమైన సాధనము వేరులేదు. అదియునుగాక జాతియొక్క జీవనము నదీప్రవాహము వంటిది. నదియొక్క నిజస్వరూపమును మనము గ్రహింపబూనిన యెడల ఆ వాహినియం దొక భాగమును మాత్రమును గాలించిన చాలదు. దాని జన్మస్థానము, దాని ప్రారంభదశ, దాని వృద్ధిక్షయములు మున్నగునవి తెలిసికొనినప్పుడే జాతియొక్క సంపూర్ణస్వరూపము మనకు దృగ్గోచరమగును. ప్రపంచనాటక రంగముపై ప్రస్తుతము నటించుచున్న యాంధ్రులు తమ జాతివారు నడచిన మార్గములను, అవలంభించిన కార్యవిధానములను, ఆర్జించిన కీర్తి విఖ్యాతులను, తెలిసికొని, వారి గుణగణముల నెరింగి దానివలన గుణపాఠమునుపొంది, వారి లోపములు తమయందు సంక్రమింపకుండునట్లు శ్రద్ధవహించుటకూడ చరిత్ర పఠనము నందలి ముఖ్యోద్దేశ్యము. ఇట్టి లక్ష్యముతో ఆంధ్రులెల్లరును తమ జాతిచరిత్రను తప్పక తెలిసికొనవలయును.

## ఆంధ్రులు

ఆంధ్రము మాతృభాషగా కలవారందరును ఆంధ్రులు. ఇట్టివారు పరరాష్ట్రములందు నివసించుచున్నను వారాంధ్రులు కాకమానరు. ఉదాహరణమునకు చిరకాలమునుండి బొంబాయి రాష్ట్రమునందును, తమిళదేశమునందును నివసించుచున్న ఆంధ్రులు చాలమంది కలరు. వారు నేటికిని తెనుగుభాషనే మాట్లాడుచున్నారు. ఇట్టివారిని మనము రాష్ట్రేతరాంధ్రు లని వ్యవహరించుచున్నాము. రామభక్తాగ్రేసరుడును, గాయక సార్వభౌముడు నగు త్యాగరాజస్వామి రాష్ట్రేతరాంధ్రుడే. విశాలదృష్టితో చూచిన యెడల ఆంధ్రులయందును, ఆంధ్ర భాషయందును అభిమానము గలవారును, ఆంధ్రదేశమునందు శాశ్వతముగ నివసించువారునుకూడ ఆంధ్రులే యనవచ్చును. విజయనగర సామ్రాజ్య చక్రవర్తియైన కృష్ణదేవరాయలను మన మాంధ్రుడనియే తలంచుచున్నాము. కాని ఆయన మాతృభాష "తుళు" కాని, ఆంధ్రముకాదు. ఆయన యద్వి తీయమగు ఆంధ్రాభిమానము వలననే మన మాయనను తెలుగు ప్రభువుగ పరిగణించుచున్నాము.

## ఆంధ్రభాష

ఆంధ్రభాష, ఆంధ్రులందరను బంధించియున్న స్వర్ణ సూత్రముగ మన మంగీకరించియున్నాము. కాని అనాదినుం డియు ఈభాష ఈ స్వరూపములో లేదనియు, ప్రథమ దశయం దియ్యది యొక ప్రాకృతభాషగ నుండెననియు మన మెరుంగ

వలెను. ఆంధ్రభాషయొక్క తత్త్వమును గూర్చి భాషాతత్త్వ శాస్త్రజ్ఞులలో నేటికిని భేదాభిప్రాయము లున్నవి. కొందరు పండితులు మన భాష సంస్కృతమున కపభ్రంశమైన పైశాచీ ప్రాకృతమునుండి కాలక్రమమున వృద్ధిచెందిన భాష యని తలంచుచున్నారు. మరికొందరు విద్వాంసు లాంధ్రము ద్రావిడ భాషాకుటుంబములోని భాగమనియు, నేడిందు కాన్పించు చున్న తత్సమాది శబ్దములు గీర్వాణభాషాభిమాను లిందులో చేర్చిన వనియు అభిప్రాయపడుచున్నారు. ఈ వాద మింకను పర్యవసానమునకు రాలేదు.

## ఆంధ్రదేశము — దాని సంపద

ఆంధ్రదేశముయొక్క విస్తీర్ణము సుమారు లక్షయు పదునేడువేల చదరపు మైళ్ళు. రాజకీయ కారణముల వలన నీ దేశము ప్రస్తుతము మూడుభాగములుగ విభజింపబడి యున్నది. మదరాసు రాజధాని యందలి గంజాము, విశాఖ పట్టణము, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, జిల్లాలును, చెంగల్పట్టు, చిత్తూరు జిల్లా లలో కొంతభాగమును, రాయలసీమ యనబడెడి దత్తమండల ములును, (ఇందు కొన్ని తాలూకాలు కర్ణాటక ప్రాంతములో చేర్పదగినవి కలవు.) నైజాము రాజ్యమునందలి తొమ్మిది జిల్లా లును, మైసూరు రాష్ట్రమునందలి మూడు జిల్లాలును మధ్య పరగణాలలో కొంతభాగమును చేర్చిన యెడల ఆంధ్ర

రాష్ట్రముయొక్క నిజస్వరూప మేర్పడును. ఈ దేశమునందు శీతోష్ణస్థితి జననివాసమునకును, సస్యాభివృద్ధికిని అనుకూల ముగ నున్నది. ఇందు గోదావరి, కృష్ణ, పినాకిని మున్నగు నదీమతల్లులును, ఎన్నియో ఉపనదులును ప్రవహించుచుండుట చేత, ఈ భూభాగము చాలవరకు సారవంతముగ నున్నది. జలసమృద్ధి లేని ప్రదేశములు కూడ వ్యర్థముగ నుండక మెట్ట పైరులు పండించుట కుపయోగింపబడుచున్నది. ఆంధ్రదేశ ములో పెక్కుచోట్ల దట్టమైన యడవులుకూడ కలవు. ఇచ్చట బంగారు, ఇనుము మున్నగు లోహములును, అభ్రకము రాక్షసి బొగ్గును లభించు గనులు కాననగుచున్నవి. ఈ రాష్ట్ర మొకా నొక కాలమున రత్నపుగనులకై కూడ ప్రసిద్ధిచెందియుండెను. మార్కో పోలో అను యాత్రికుడు గోల్కొండ రాజ్యపు రత్నములను పేర్కొనెను. ఆంధ్రరాష్ట్రముయొక్క ప్రస్తుత జనసంఖ్య సుమారు 3 కోట్లు, భారత దేశమును భాషా ప్రయుక్తరాష్ట్రములుగ విభజించినపక్షమున ఆంధ్రరాష్ట్రము సర్వవిధముల నుత్తమశ్రేణి నలంకరించుట కర్హమై హిందీ భాషా ప్రాంతము, బంగాళములతో పోల్చుటకు దగియుండును. ఇచ్చటి ప్రజలు, బుద్ధిసంపదయందును, కార్యోత్సాహము నందును, దేశాభిమానమునందును, మరేజాతివారికిని తీసిపోరు.

## ఆంధ్రదేశము — నామాంతరములు

అతి పురాతన కాలములో మనము ప్రస్తుతము నివ సించుచున్న యాంధ్రదేశము దట్టమైన యడవులతో నిండి,

మనుష్యనివాసమున కయోగ్యముగ నుండినందున, ఔత్త రాహులు దీనిని అంధకారబంధురమైన దేశము లేక ఆంధ్రదేశ మని పిలచెడి వారని తెలియవచ్చుచున్నది. ఈ దేశమునకు పూర్వము గ్రంథములందును, శాసనములందును, త్రికళింగ మను పేరుకూడ వాడబడియున్నది. పూర్వకాలములో గంగా నది మొదలు కటకము వరకుగల దేశము నుత్తర కళింగ (ఉత్కల) మనియు, కటకము మొదలు గంజాము జిల్లాయందలి మలయకొండల వరకును మధ్య కళింగమనియు, అచ్చటినుండి గోదావరినదివరకు గల ప్రదేశమును త్రికళింగ మనియు వ్యవ హరించుచుండినట్లు చారిత్రకాధారములు కలవు. కాలక్రమ మున నీ త్రికళింగ శబ్దమునందలి "క" శబ్దము లోపించి యీ దేశము త్రిలింగదేశమని వర్ణింపబడెను. త్రిలింగ శబ్దమును పండితులు మరొక విధముగకూడ అన్వయించి యున్నారు. ఈ దేశమునందు సుప్రసిద్ధములగు మూడు శివలింగములు, శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరము అను ప్రదేశము లలో నెలకొని యుండుటవలన నీ దేశమునకు త్రిలింగ దేశ మని పేరు వచ్చెనని యొక వాదము కలదు. పైవాదముల కను కూలించు నొక గాథ బ్రహ్మాండపురాణమునందు కానవచ్చు చున్నది. త్రిలింగశబ్దమునుండి తెలుగు, తెనుగు మున్నగు పదములు పుట్టినవి. నైజాము రాజ్యమునందలి తెలుగు జిల్లా లకు తెలంగాణము అను పేరుకూడ ఇటీవల వాడబడుచున్నది. దీనియొక్క పుట్టు పూర్వోత్తరములను గురించికూడ పండితులు

మీమాంస చేయుచున్నారు. కాని ఇదమిత్థమని యే నిర్ణయ మును కావింపలేదు.

## ఆంధ్రు లెవరు ?

ఆంధ్రదేశమునందలి ఆదిమనివాసులను గూర్చి కాని, వా రేజాతికి చెందినవారో యెరుంగుటకు కాని, చారిత్రిక నిదర్శనములు విశేషము లేవు. ప్రస్తుత ఆంధ్రజాతి లక్షణము లనుబట్టి చూడ మన జాతి ఆర్యద్రావిడసంఘముల కలయికచే పరిణమించినట్లు తోచక మానదు. అతిపురాతన కాలములో ఈ దేశము నిబిడనీరంధ్రారణ్య పరివృతమై యున్న కాలములో నిచ్చట ఆటవికులగు అనాగరకజాతులవారు నివసించుచుండిరి. మరికొంతకాలము గడచునప్పటికీ దేశమున ద్రావిడు లనువారు నివాస మేర్పరచు కొన్నట్లు తెలియవచ్చుచున్నది. ఈ ద్రావిడులు మరెచ్చటినుండియైన ఇచ్చటకు వచ్చిరా, లేక వారీ దేశమునకే చెందినవారా యను సంశయములను నిర్ణయించుటకు తగిన యాధారములు లేవు. ఈ ఆదిమనివాసులు వర్ణముచేతను, భాషచేతను, ఆచారవ్యవహారములచేతను, ఆర్యులకంటె భిన్నులుగా తోచుచున్నారు. ఐతరేయ బ్రాహ్మణమునందు ఆంధ్రులు విశ్వామిత్రుని సంతతివారని తెలుపబడి యున్నది. విశ్వామిత్రుడు తన కుమారులలో ౫౦ మందిపై గోపించి వారిని ఆర్యదేశమునుండి తరిమివేసినట్లును వా రనార్యులతో కలిసి నివసింప జొచ్చినట్లును ఈ గ్రంథమువలన తేలుచున్నది. అగస్త్యుడను ఆర్యఋషి తన తపోప్రభావముచే వింధ్యపర్వతము

యొక్క గర్వము నడచిపైచి దక్షిణదేశమునందు ప్రవేశించి నట్లు కొన్ని గాథలు కలవు. పై రెండువిషయములను మనము సమన్వయము చేసిన యెడల కాలక్రమమున ఆర్యు లుత్తర దేశమునుండి దక్షిణాపథమునకు వచ్చిరనియు, ఇట్లు వచ్చిన ఆర్యులలో కొందరు ఆంధ్రదేశమందలి ప్రజలతో నేకమైపోయి నట్లును తేలుచున్నది. పై యంశముల వలన ఆంధ్రదేశస్థులు ఆర్యద్రావిడ జాతుల సమ్మేళనము వలన సంభవించిన వేరొక జాతియని తెల్పుట సత్యేతరము కానేరదు. అతిప్రాచీన కాలములో వింధ్యపర్వతమునకు దక్షిణమునందున్న దేశమందు నాగులను జాతివారు నివసించుచున్నట్లు మన కనేక దృష్టాంత ముల వలన తెలియవచ్చుచున్నది. భారతవీరుడైన యర్జు నుడు నాగలోకమున కేగి నాగకన్యలను వివాహమాడినట్లును, ఆతని మనుమడగు పరీక్షితుడు ఒక నాగునిచే చంపబడుటచే పరీక్షితుని కుమారుడగు జనమేజయుడు సర్పయాగమును చేసి నాగకులమును చాలవరకు నాశనము చేసెననియు, మహాభార తమునందు గాథలు కలవు. చారిత్రక దృష్టితో చూచిన పక్ష మున మహాభారత కాలమునందు ఆర్యులకును దక్షిణాపథ మందు వసించుచుండిన నాగులకును యుద్ధము సంభవించె ననియు ఈ గాథలనుండి మనము తెలిసికొనవచ్చును. బౌద్ధ గాథల వలనను, అమరావతీ స్తూపముపై చిత్రింపబడిన నాగు బొమ్మల వలనను, దక్షిణాపథము నాగుల నివాసభూమిగా నుండెనని యెరుంగవచ్చును. ఈ నాగులే ద్రావిడులని యె

చుట సత్యదూరము కాదు. ఆర్యులు మాత్రము వీరిని ద్రావిడులని వ్యవహరించెడివారు. ఈ నాగజాతివారు సర్పములను పూజించుట వలనను, సర్పధ్వజములు కల్గి యుండుటవలనను వీరి కీ నామము సిద్ధించి యుండవచ్చును. ఈ నాగులలో నొక తెగవారు పూర్వకాలములో నాంధ్రదేశమున నివసించుచుండిరనియు, కారణాంతరముల వలన ఆర్యసంఘము నుండి వెడల గొట్టబడిన ఆర్యులు కొందరు దక్షిణాపధమునకు వచ్చి, ఆంధ్ర దేశమున నివాస మేర్పరచుకొని, ఆ దేశస్థులైన నాగజాతీయుల యాచార వ్యవహారముల నవలంబించి వారిలో నైక్యమైపోయిరనియు, వీరే ప్రాచీన కాలపు టాంధ్రులనియు మనమూహింపవచ్చును.

## మొదటి ఆంధ్రరాజులు

ఆంధ్రులు సనాతన కాలమునుండియు బలవంతులైన జాతిగ నుండిరనుటకు నిదర్శనములు పెక్కులు గలవు. సుమారు మూడు వేల సంవత్సరములకు పూర్వము రచియింపబడిన ఐతరేయ బ్రాహ్మణములో నాంధ్రుల ప్రశంస గలదు. మహాభారత కాలమునాటి కాంధ్రులు (నాగులని వారు వ్యవహరింపబడెడివారు) బలవత్తరులై యుండినట్లును, వీరికిని పాండవుల వంశస్థుడైన జనమేజయునకును పోరాటము సంభవించినట్లును కూడ మనము తెలిసికొని యున్నాము. క్రీస్తు పూర్వము ఏడవశతాబ్ది యందు మగధరాజ్యమును నాగవంశజులగు రాజులు పాలించిరని చరిత్రల వలన దెలియుచున్నది. ఈ వంశము శిశునాగ వంశమని





పిలువబడుచుండెను. ఈ వంశస్థు లాకాలమున దక్షిణ ప్రాంతములో నివసించుచున్న నాగజాతికి చెందినవారే యనుట అసమంజసము కానేరదు. చంద్రగుప్త మౌర్యునిచే రాజ్య భ్రష్టులు కావింప బడిన నందులు కూడ యీ వంశీయులే యని తోచుచున్నది. లేకపోయిన శిశునాగవంశీయులలో నొక రాజును పదభ్రష్టునిచేసి నందులు రాజ్యాధిపత్యమును బూని యుండవచ్చును. ఈ శిశునాగు లార్య క్షత్రియులు కారనియు, వీరియెడ నార్యులు ప్రబల ద్వేషమును వహించి యుండిరనియు తెలియవచ్చు చున్నది. ఈ యంశముల వలన క్రీ. పూ. ఏడవ శతాబ్దియందు మగధ రాజ్యమును పాలించినవారు నాగు లన బడియెడి ఆంధ్రులేయని తలంచుటకు మన కాధారములు గలవు. ఆంధ్రదేశము మగధ రాజ్యమునకు సరిహద్దులోనున్న కారణమున నీ నాగవంశీయు లాంధ్ర దేశీయులే కావలెనను యనుమానము దృఢమగుచున్నది. శిశు నాగవంశములో నాఱవవాడైన యజాతశత్రుని కాలములో మహనీయుడగు గౌతమ బుద్ధుడు జన్మించెను.

## ప్రాచీన మతములు — బౌద్ధము

ఈ కాలమునాటి కాంధ్రదేశీయుల మతము వృక్షము లను, సర్పములు మున్నగు వానిని పూజించుటయై యుండెను. కాళీపూజయు, ఆ దేవి ప్రీతికై జంతు బలులునుగూడ ఆ యుగములో ప్రబలముగ నుండెను. ఇది యిట్లుండ హిమవత్

ర్వత ప్రాంతములందు నివసించు యక్షులను జాతివారు దక్షిణా పథమునకు వచ్చి, ఇచ్చట తమతమ విశ్వాసములను ప్రజల యందు ప్రచారము గావించిరి. ఈ యక్షులు శివపూజకులు. వీరు శివుని, పార్వతిని, వారి కుమారుడగు స్కందుని కూడ కొల్చుచుండిరి. వీరరసావతారమగు స్కందుడీ యాటవిక యక్షుల కుపాస్యదైవతముగ నుండుటలో యాశ్చర్యములేదు. ఇట్లే బలరామకృష్ణులను దేశీయ వీరుల పూజకూడ నీకాలమున మిక్కిలి వ్యాప్తి గాంచెను. గౌతమ బుద్ధుడు తన మత బోధను ప్రారంభించిన తరువాత, ఆయన మత మాంధ్రదేశమున వ్యాపింప జొచ్చెను. ఇంకను అనాగరక స్థితియందున్న నాగాంధ్రులు ఆర్యమత సంప్రదాయములకంటె బుద్ధమతమునే ఎక్కువగ ఆదరించి దానినే అవలంబించినట్లు తెలియుచున్నది. ఈ దేశమును పాలించుచుండెడి నాగ రాజొకడు బుద్ధదేవుని సందర్శించెనని బౌద్ధ గాథల వలన దెలియుచున్నది. ఈ యంశములన్నియు ఆంధ్రదేశమున బౌద్ధమతమును విశేషముగ నాదరించెననుటకు నిదర్శనములుగ నున్నవి.

## ఆంధ్రదేశము — సూత్రకారులు

క్రీ. పూ. 5వ శతాబ్దియందలి చతుర్థ పాదమునందును, 4వ శతాబ్ది ప్రథమ పాదమందును బోధాయన ఆపస్తంబులను ప్రసిద్ధ సూత్రకారు లీ యాంధ్రదేశమునందే యుండిరి. వీరు ఆనాటి కీ దేశమునందు వసించియున్న ఆర్యాంధ్రుల కొరకై

కొన్ని సాంఘిక నియమముల నేర్పాటు చేసిరి. ఈ నియమము లా కాలములో దేశమంతటను వ్యాప్తి చెందక పోయినను, వైదికమతము ప్రబలిన తర్వాత సార్వజనీనముగ నంగీకరింప బడెను. ఆ కారణము వలననే ఆంధ్రదేశములో నధిక సంఖ్యాకు లాపస్తంబ సూత్రులుగ నున్నారు. ఈ సూత్రకారుఁడు వివాహబంధమును కఠినతరముగ జేసెను. వివాహ ప్రతిజ్ఞకు వ్యతిరేకముగ పురుషుడుగాని స్త్రీగాని అన్యత్రవర్తించినచో వారు నరకములోనికి పోవుదురని శాసించెను. అశాస్త్రీయ సంతానమునకు శాస్త్రీయ సంతానముతో సమానమగు హక్కులు పూర్వసూత్రకారుడగు బోధాయను డొసంగియుండ నాపస్తంబుడా మతమును ఖండించి అశాస్త్రీయ సంతానమునకు ఆస్తియందు సమానభాగము నీయరాదని నిషేధించెను. వేదాది విద్యలను శూద్రులు పఠింప రాదనియు నట్లు చేసిన యెడల వారు శిక్షార్హులనియు శాసించెను. పై సూత్రములను శ్రద్ధగ నాలోచించిన పక్షమున నా కాలము నందు సంఘమునందు వర్ణసాంకర్యము, వివాహ వ్యతిరేకము లగు స్త్రీ పురుష సంబంధములును విశేషముగ నున్నట్లును, వాని నిరోధించుటకై సంస్కర్తలగు మహనీయులు పాటుపడినట్లును తేలుచున్నది.

## స్వతంత్రరాజ్య స్థాపనము

క్రీస్తు పూర్వము నాలుగవ శతాబ్దియందు ఆంధ్ర రాజ్య స్థాపనము కావింపబడినట్లు చరిత్రకారు లూహించు చున్నారు.

మగధ రాజ్యమును పాలించిన మౌర్య చంద్రగుప్తుని కాలములో నాతని కడ యవన రాయబారిగ నున్న మెగాస్తనీస్ ఆంధ్రుల గూర్చి ప్రసంగించుచు, చంద్రగుప్తుని రాజ్యము తరువాత ఆంధ్రుల రాజ్యమే బలవత్తరమైనదనియు, వారి రాజ్యములో ముప్పది దుర్గములును, లక్ష కాల్బలమును, రెండువేల యాశ్విక సైన్యమును, వేయి ఏనుగులు నున్నట్లు తెల్పియున్నాడు. ఈ కాలమునాటికి బలవత్తరమగు స్థితియందున్న ఆంధ్రరాజ్య మంతకు పూర్వమే స్థాపింపబడి యుండవలెను. మౌర్యుల కాలములో ఆంధ్రులు స్వతంత్రులు గారు. కాని చంద్రగుప్తుడు కాని, బిందుసారుడు కాని, అశోకుడు కాని ఆంధ్ర రాజ్యముపై దాడి వెడలి ఆ దేశమును జయించినట్లు నిదర్శనములు లేవు. కావున మగధ సామ్రాజ్య ప్రాబల్యము నకును, ప్రతిష్ఠకును వెరచి ఆంధ్రులు మౌర్యులను సామ్రాట్టులుగ నంగీకరించినట్లు మన మూహింపవచ్చును. అశోకవర్ధనుని యనంతరము ఆంధ్రులు స్వతంత్రులై తమ యధికారమును నలుప్రక్కల విజృంభింప జేసిరి. క్రీ. పూ. 184 ప్రాంతములలో పుష్యమిత్రుడను సంగ లేక శుంగ వంశపురాజు మగధ యందు రాజ్యము చేయుచుండగా కళింగదేశపు రాజైన ఖారవేలుడను నాతడు పుష్యమిత్రునిపై దాడి వెడలి యాతనికి గర్వభంగము చేసెనట. ఈ పుష్యమిత్రునికి శాతకర్ణియను ఆంధ్రరాజు సహాయము చేసినట్లు తెలియవచ్చు చున్నది. మరి కొంత కాలము గడచిన వెనుక కాణ్వులను వారు మగధరాజ్య

సింహాసనము నధిష్ఠించియున్న కాలమున నాంధ్ర భృత్య వంశీయుడగు శ్రీముఖుడను రాజు మగధరాజును సంహరించి, తద్రాజ్యమును తాను స్వాధీనము చేసికొనెనని వాయు మత్స్యాది పురాణములు తెల్పుచున్నవి. ఈ వంశమునకు మూల పురుషుడు శాతవాహనుడు లేక శాలివాహనుడను నాతడు. ఈ రాజవంశము వారికి ముఖ్య పట్టణము కృష్ణానదీ తీరమందలి ధాన్యకటకము. వీరి కాలమునాటి శాసనములు మున్నగునవి మహారాష్ట్ర దేశమునందలి కొన్ని ప్రాంతముల లోను ఆంధ్రదేశములో పెక్కుచోట్లను కానవచ్చుచున్నవి. ఈ వంశమే ఆంధ్ర రాజవంశములలో మొదటిదని తెలుప వచ్చును. ఈ వంశీయు లొకప్పుడు మౌర్యులకు లొంగి యుండుట వలన వీరి కాంధ్ర భృత్యులనియు, శాలివాహనుడు వీరి మూల పురుషుడు కాన వీరికి శాలివాహన వంశీయు లనియు పేరు వచ్చినది.



# ఆంధ్రుల చరిత్ర

## శాతవాహన వంశము

### శాలివాహనుడు

ఆంధ్రదేశములో రాజ్యపాలనము గావించిన రాజులలో శాతవాహనవంశీయులు మొదటివారు. ఈ వంశమునకు శాలి వాహనవంశమని నామాంతరముగలదు. ఈ వంశము శాలి వాహనవంశమనుపేర ప్రసిద్ధిగాంచినను శాలివాహను డిందు మొదటిరాజు కాడని పురాణగాథలవలన దెలియుచున్నది. ఈతనికి పూర్వము సుచంద్రుడు, విష్ణువు (ఆంధ్ర విష్ణువు), దీప కర్ణియను ముగ్గురురాజులు రాజ్యముచేసిరి. శాతవాహనుడు దీపకర్ణికుమారుడు. ఈతని బాల్యమునుగూర్చి విచిత్రమైన గాథలు కలవు. శాలివాహను డాంధ్రప్రాంతముననేగాక మహా రాష్ట్రమునందును, ఉత్తరప్రాంతములలోనుకూడ ప్రఖ్యాతి గాంచినప్రభువు. బృహత్కథయను ప్రసిద్ధ ప్రాకృతగ్రంథము నీతడు ప్రచారములోనికి దెచ్చెను. ఈతనికాలములో గుణాఢ్యు డను విఖ్యాతపండితుడొక డుండెను. ఆతడే బృహత్కథను

పైశాచీభాషలో వ్రాసి శాతవాహనుని కొసంగెనని గాథలు కలవు. ఏది యెట్లున్నను శాతవాహనవంశమని ప్రసిద్ధి చెందిన ఆంధ్రవంశ మీతని పేరుతోడనే ఖ్యాతి చెందినది. ఈ వంశములో ముప్పదిరాజు లున్నట్లు మత్స్యపురాణమువలన దెలియుచున్నది. ఇతరపురాణము లీరాజులలో కొందరినామములు మాత్రము పేర్కొనుచున్నవి.

## ఇ త ర రా జు లు

మత్స్యపురాణముప్రకార మీ వంశీయులు నాలుగు శతాబ్దములపైబడి రాజ్యముకావించిరి. ఈ రాజులందరును శాతకర్ణియను బిరుదనామమును గ్రహించిరి. ఈ వంశమున శ్రీముఖుడనురాజును మొదటివానినిగ పురాణములు పేర్కొనుచున్నవి. ఈతడు క్రీ. పూ. 73 సంవత్సరమున రాజ్యమునకు వచ్చి 23 సంవత్సరములు పరిపాలనము చేసెను. ఈరాజు మగధరాజ్యము నాక్రమించి, యచ్చట శాంతిప్రతిష్ఠాపనము చేసి తనరాజధానియైన ధాన్యకటకనగరమునకు మరలివచ్చెను. ఈ వంశమునందు పాలించినరాజు లందరనుగూర్చి విపులముగ చర్చించుట కిచ్చట సాధ్యపడదు. ఈ కాలపు ఆంధ్రరాజులు దక్షిణాపథమందలి తూర్పుతీరమునందుమాత్రమేగాక పశ్చిమ సముద్రమువరకును తనరాజ్యమును విస్తరింప జేసిరనియు, గోదావరీతీరముననున్న (పైఠణ్) ప్రతిష్ఠాన పురమాంధ్రరాజ ప్రతినిధులకు ముఖ్యస్థానముగ నుండెననియు తెలియవచ్చు

చున్నది. ఈ వంశీయులలో హాలుడనురాజు క్రీ. వె. 52 మొదలు 79 వరకును రాజ్యపాలనముచేసి మిక్కిలిఖ్యాతిగాంచెను. ఈతడు ప్రతాపశాలి, విద్వాంసుడు, విద్యాపోషకుడు. ఈ రాజు ప్రాకృతభాషలో సప్తశతియను నీతి శృంగారప్రబంధమును రచించెను. హాలునితరువాత ఆంధ్రరాజ్యమునం దల్లకల్లోలము ప్రారంభమయ్యెను. శాకులు, యవనులు, పహ్లావులు (అను విదేశీయులు) భారతదేశముపై దండెత్తి యిచ్చట రాజ్యస్థాపనముచేయసాగిరి. గుజరాతు, మాళవదేశములలో రాజ్యమును సంపాదించిన క్షాత్రవులను రాజులకును, ఆంధ్ర రాజులకును యుద్ధములు సంభవించెను. ఈ కాలములో ఆంధ్ర రాజుగనున్న శివస్వాతికర్ణుడు (109–130) క్షాత్రవులతో పోరాడి పశ్చిమాంధ్రదేశమును గోల్పోయెను. గోతమపుత్ర శాతకర్ణుడనురాజు (133–154) క్షాత్రవులతోపోరాడి ఆంధ్ర రాజ్యమును మరల బలపరచినట్లు చరిత్రవలన దేలుచున్నది. గోతమపుత్రయజ్ఞశ్రీశాతకర్ణుడు (క్రీ. త. 172–205) అను రాజుకాలమునకూడ ఆంధ్రరాజ్య మున్నతస్థితియందే యున్నట్లు తెలియుచున్నది. ఈ రాజుకాలములో నాగార్జునుడను ప్రసిద్ధ బౌద్ధాచార్యుడు జీవించెను.

## ఆంధ్రదేశపు స్థితి

యజ్ఞశ్రీ శాతకర్ణునికాలపునాణెములు మనకు లభించినవి. వానిపై ఓడలయొక్క చిత్రములు కాన్పించుచున్నందున నా కాలములో సముద్రయానములు విశేషముగ జరుగు

చుండెననియు, ఆంధ్రదేశీయులు జావా, బోర్నియో, సుమిత్రా, చీనా, బర్మా మున్నగు దేశములతో నోడవర్తకము చేయుచుండెడివారనియు, ఊహించుట కవకాశమేర్పడుచున్నది. శాతవాహనచక్రవర్తులకు త్రిసముద్రాధిపతు లను బిరుద ముండెను. ఈ రాజుతరువాత శాలివాహనవంశము క్రమక్రమముగ క్షీణింపసాగెను. ఈ కాలములో ఆంధ్రదేశము సర్వవిధముల మిక్కిలి ఉన్నతస్థితియం దుండినట్లు తెలియుచున్నది. ఆకాలపు పట్టణములలో ధాన్యకటకనగరము మిక్కిలి విఖ్యాతిచెంది యుండెను. దీనికి ధాన్యవాటియను పేరుకూడ వాడబడుచుండెను. ఈ పట్టణము కృష్ణానదీతీరమున ప్రస్తుతము గుంటూరు జిల్లాలో నున్నది. ఈ పట్టణము పురాతనకాలములో నాగరాజులకును, తరువాత శాలివాహనవంశీయులకును రాజధానిగ నుండెను. ఆ కాలమున భారతదేశమందు పాటలీపుత్రముతరువాత ధాన్యకటకమే మిక్కిలి విఖ్యాతిచెందియుండెను. ఈ నగరమునందు ధాన్యరాసులు విశేషముగ నుండుటవలన దీనికి ధాన్యవతియను పేరు కల్గెనని చైనాదేశపుయాత్రికులు వర్ణించియున్నారు. ప్రబలముగనుండినకాలములో ఆంధ్రరాజుల యధికారము దక్షిణమున మైసూరు మొదలుకొని ఉత్తరమున గంగానదివరకును వ్యాపించియుండెను.

## బౌద్ధమత ప్రాబల్యము

ఆ కాలములో బౌద్ధమతమే ఆంధ్రదేశములో బహుజనానురాగమును బడసియుండెను. ప్రజలలో పలువురు బౌద్ధ

మతావలంబకుల ఉపయోగమునకై గుహలను, మఠములను, చైత్యనములను నిర్మించుచుండిరి. ఆ కాలమున భారతదేశముపై దండెత్తివచ్చి తరువాత హైందవధర్మము నంగీకరించిన శక యవన పహ్లావరాజులలో పలువురుకూడ బౌద్ధసన్యాసులు మున్నగువారి సౌకర్యమునకై యిట్టి గుహలు మొదలైన వానిని నిర్మింపజేసిరి. ఈ గుహాలలో సన్యాసులు మున్నగువారు నివసించుచు, తరచుగ దేశాటనము చేయుచుండిరి. ఈ విరాగులపోషణార్థము ధనాఢ్యులగువారు ధనమును, కొన్ని గ్రామములనుకూడ ఇచ్చుచుండెడివారు. ఆంధ్రదేశమునందు బెజవాడ, గుంటుపల్లి, శ్రీశైలము మొదలగు ప్రదేశములలో నిట్టి గుహాలు కాననగుచున్నవి. బౌద్ధమతస్థులలో మహాసాంఘికులనియు, మహావీరులనియు రెండు తెగ లున్నట్లుకూడ తెలియుచున్నది. ఆంధ్రరాజులును, ప్రజలలో పలువురును బౌద్ధమతాభిమానులైయుండినను వైదికమతముకూడ వర్ధిల్లుచునే యుండెను. గౌతమపుత్రి శాతకర్ణివంటిరాజులు బ్రాహ్మణమతము పోషించినట్లుకూడ శాసనములవలన తేలుచున్నది. ఆ కాలమునందు వర్ణాశ్రమధర్మము మిక్కిలి కఠినముగా లేకుండెను. బ్రాహ్మణులన్నివర్ణములస్త్రీలను వివాహము చేసికొనుటయు, మాంసభోజనముచేయుటయుకూడ నాచారముగ నుండెను. వైదికమతముతోపాటు జైనశైవమతములుకూడ జనాదరమును బడయుచుండెను.

## ఆంధ్ర సంస్కృతి

ఆ కాలమునం దార్యులు సంస్కృత ప్రాకృతములు రెండుభాషలను కూడ వాడుచుండిరి. రాజకీయ విషయము లలో ప్రాకృతమే ఉపయోగింపబడెడిది. ఆంధ్రులు వాడెడి భాషను ఆర్యులు పైశాచీభాష యని నిరసించినను ఆంధ్ర రాజు లీ భాషనే నిత్య వ్యవహారము లందును, గ్రంథ రచనమునకును కూడ ఉపయోగించిరి. గుణాఢ్యుడను పండితుడు వ్రాసిన బృహత్కథయును, హాలుడను రాజు వ్రాసిన సప్తశతి యను గ్రంథమును ఆకాలపు ప్రాకృత గ్రంథములలో ప్రశస్తి గాంచెను. శాతవాహన యుగములో శిల్పవిద్య మిక్కిలి యభి వృద్ధి చెందెను. ఆంధ్రరాజు లనేక చైత్యములు, విహారములు, స్తూపములు మున్నగు వానిని నిర్మింపించిరి. ఈకాలపు కట్టడ ములలో అమరావతీస్తూపము మిక్కిలి ప్రఖ్యాతి గాంచినది. ఇయ్యది కృష్ణానదీతీరమున అమరావతి యను గ్రామమునకు సమీపమున నున్నది. ఈ స్తూపమునందు ప్రదర్శింపబడిన శిల్ప చాతుర్యము, చిత్ర కళానైపుణియు ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులచే విశేషముగ కొనియాడబడినవి. ఇందు చిత్రింప బడిన గాథలు బౌద్ధమత సంబంధ మైనవి. అమరావతీస్తూపము వంటివే ఇతరస్తూపము లాంధ్రదేశములో గుడివాడ, భట్టి ప్రోలు, ఘంటసాల మున్నగు ప్రదేశములలో కలవు. ఇవిగాక కార్లీపర్వతములోని చైత్యములును, అజంతా విహారములు

కూడ చాల విఖ్యాతిగాంచి యున్నవి. ధర్మ కార్యములును, పౌరజన హితములగు ధర్మములను నిర్వర్తించుటకై యా కాల మునందు పౌరులు సంఘములుగ నేర్పడి కార్య నిర్వహణము చేయుచుండిరనియు కొన్ని శాసనముల వలన తెలియ వచ్చు చున్నది. ఆకాలపు టాంధ్రులు స్వపరిపాలనా పద్ధతుల నెరింగి యుండి రనుట కియ్యవి నిదర్శనము.

## పరిశ్రమలు — వ్యాపారము

వర్తకులు, నేతగాండ్రు మున్నగువారు తమ తమవృత్తి నిర్వహణమునకై వేర్వేరు సంఘముల నేర్పాటు చేసికొను చుండినట్లు తెలియనగుచున్నది. ఈ ఆంధ్రరాజుల పరిపాలన ములో మన దేశమునకు అరేబియా, ఈజిప్టు, రోము, గ్రీసు, పారసీకము మున్నగు దూరప్రాంతములనుండి ఓడలు వర్తకము నిమిత్తమై వచ్చుచుండి నట్లును, అయ్యవి మోటుపల్లి యనెడి ప్రదేశము కడనో, లేక మచిలీపట్టణము వద్దనో తమ సరకులను దింపుచుండె ననియు చరిత్రకారు లభిప్రాయ పడుచున్నారు. ఈ ప్రాంతములో నా కాలమున సన్నని నూలుబట్టలు తయా రగుచున్నట్లు తెలియ వచ్చుచున్నది. ఈ కాలమునందు రోము దేశములో వాడబడుచున్న నాణెములు ఆంధ్ర దేశములో భూగర్భము నుండి తీయబడి నందున పురాతన కాలములో ఆంధ్ర దేశీయులు దూర ప్రాంతములతో వ్యాపారము చేయు చుండిన ట్లూహించుట కవకాశముకలదు.

## వేషధారణము

ఆకాలపు స్త్రీ పురుషాదుల వస్త్రధారణము, నగలు మున్నగు వానిని గూర్చికూడ మనకు కొన్ని యంశములు తెలియ నగుచున్నవి. పురుషులును, స్త్రీలును కూడ కటిభాగము పైన నెట్టి వస్త్రములను ధరించెడివారు కారు. స్త్రీలు కాళ్ళకు బరువైన కడియములు, అందెలు, నడుమునకు ఒడ్డాణము, చేతు లకు బరువైన కంకణములు, మెడలో వెడల్పగు మెడసరములు, పెద్ద చెవిపోగులు ధరించెడివారు. పురుషులు పెద్ద తలపాగలను కూడ చుట్టుకొనెడివారు. వీరులగు వారు విల్లును, అమ్ములను కూడ ధరించుట యాచారముగ నుండెను.



# ఆంధ్రుల చరిత్ర



## ఇక్ష్వాకులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు
(క్రీ. వె. 200 – 620 వరకు)

### శాతవాహనుల యనంతర మాంధ్రదేశము.

శాతవాహనాంధ్ర సామ్రాజ్య భానుడు క్రీ. వె. మూడవ శతాబ్దారంభమునందు అస్తమించినట్లు చారిత్రికులు నిర్ణయించు చున్నారు. ఈ వంశమునందు కడపటి గొప్ప చక్రవర్తియైన యజ్ఞశ్రీ శాతకర్ణి కాలమున (157–186) ఆంధ్ర సామ్రాజ్యము ఆరిపోవు దీపమువలె ఒక వెలుగు వెలిగి క్రమముగా క్షీణించి, అంతః కలహములకు లోనై క్రీ. వె. 210 ప్రాంతమున కడముట్టెనని తెలియవచ్చు చున్నది. ఇది మొదలుకొని తూర్పు చాళుక్య వంశము వారు ఆంధ్రదేశ పరిపాలకులగు నంతవరకుగల కాలము ఆంధ్రదేశ చరిత్రలో ఇది వరకు అజ్ఞాతయుగమై అంధకార పూరితముగ పరిగణింపబడెడిది. కాని అనంతర కాలములో జరిగిన పరిశోధనల వలన

ఈ యవాంతర యుగపు చరిత్రి మనకు కొంతవరకు విస్పష్ట ముగా తెలియుచున్నది. ఈ నాలుగు శతాబ్దులలోను ఆంధ్రి దేశమును పెక్కు రాజవంశములు తమ బాహుబలముచే రక్షించి తమకీర్తి చిహ్నములను మన కప్పగించి పోయిరి. ఈ వంశములే ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, ఆనంద గోత్రీకులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు అని ప్రసిద్ధి వహించినవి. ఈ రాజవంశముల శిలాతామ్రశాసనాదులు ఆంధ్రి దేశము నందలి పలుప్రదేశములలో లభించి వారి చరిత్రినిర్మాణమునకు ఆధారభూతము లయినవి.

## ఇ క్ష్వా కు లు

అందు మొట్టమొదట పేర్కొనదగిన వారు ఇక్ష్వాకు వంశమువారు. వీరి శాసనములు కృష్ణానదీతీరము నందలి నాగార్జునకొండ లోయలో ఉపలభ్యములైనవి. ఇక్ష్వాకువంశము మిక్కిలి పురాతనవంశముగా ఆంధ్రులలో వాడుకగలదు. మిక్కిలి ప్రాచీనమైన విషయము అని చెప్పవలసి వచ్చినప్పుడు "అది ఇక్ష్వాకులనాటి గాథ" అను వ్యవహారము ఇప్పటికిని మనలో కలదు. ఇక్ష్వాకు వంశమువారు మొదట శాతవాహ నాంధ్రి చక్రవర్తులకు సామంతులై యుండి ఆ సామ్రాజ్యము ఛిన్నాభిన్నమగునపుడు ముందునకువచ్చి స్వాతంత్ర్యమును స్థాపించుకొనిరి. పురాణాదులలో వీరిని (శ్రీ) పర్వతీయాంధ్రివంశమని వ్యవహరించిరి. దీనికి తార్కాణముగా ఇక్ష్వాకుల రాజధానియైన

విజయపురి అను పట్టణము కృష్ణానదిమీాద నుండెను. దీని సమీాపమందే బౌద్ధుల మహాపవిత్రక్షేత్రమైన శ్రీ పర్వతమను కొండయు దానిపై ఒక ప్రసిద్ధమైన సంఘారామమును ఉండెడివి. విఖ్యాత బౌద్ధాచార్యుడైన ఆచార్య నాగార్జునుడు ఈ శ్రీ పర్వత సంఘారామమునందే నివసించెడివాడట. శ్రీ పర్వత ప్రాంత వాసులగుటచే ఇక్ష్వాకువంశము వారు శ్రీ పర్వతీయులని పేరు గాంచిరి. ఈ యన్వయము నందలి ప్రథమ చక్రవర్తి వాసిష్ఠీపుత్ర శ్రీ శాంతమూలుడు (200–218) మహా సమర్థుడైన ప్రభువుగా గాన్పించుచున్నాడు. ఈతడు కూలి పోవుచున్న ఆంధ్ర సామ్రాజ్య భవనమునకు తాను అండయై నిలిచి, దుర్బలులైన కడపటి శాతవాహన రాజుల నంత మొందించి తాను విజయపురినుండి అశేషాంధ్ర పథమును ఏకచ్ఛత్రముగా నేలసాగెను. శాంతమూలుడు గొప్ప సేనానియై దిగ్విజయము చేసి అశ్వమేధ యాగమును, వాజపేయాది యాగములను గావించెను. శాంతమూలుని రాజ్యము కోసల కళింగ దేశములను కూడ ఇముడ్చుకొనినట్లు కాన్పించుచున్నది. శాతవాహనాంధ్ర సామ్రాజ్యము నందలి పశ్చిమ భాగము నాక్రమించి పాలించు వైజయంతీపుర ప్రభువులైన నాగరాజులు శాంతమూలునికి మిత్రులై యుండిరి.

శాంతమూలుని కుమారుడైన మాఠరీపుత్ర శ్రీ వీర పురుషదత్తుడు, తండ్రి నిర్మించిన విస్తృతసామ్రాజ్యమును సమర్థతతో ఇరువదిసంవత్సరములు (218–239) పాలించెను.

శ్రీ వీరపురుషదత్తుడు ఉజ్జయినీక్షాత్రియుల ఇంటిబిడ్డను వివాహ మాడెను. అతడు తన కుమార్తెను వనవాసి (వైజయంతీ పురము) రాజునకు పెండ్లిగావించెను. ఇట్లే మూడు రాజ్యము లును అన్యోన్య బాంధవ్యములచే మైత్రి కలిగి దేశము శాంత ముగ నుండెను. వీరపురుషదత్తుని పరిపాలనా కాలము ఆంధ్ర దేశమునందలి బౌద్ధమునకు అభివృద్ధిసమయమై యుండెను. చక్రవర్తి మొదట బ్రాహ్మణమతావలంబియై యుండియు కొంత కాలమునకు బౌద్ధమతమునం దభిమానముగలవాడై బౌద్ధుడాయెను. నాటినుండియు ఆతడు వైదికమతముమీద కక్షకట్టి ఆ మతమును అణగ ద్రొక్కుటకు యత్నించినట్లు చారిత్రకాధారములు లభించు చున్నవి. నాగార్జున కొండ లోయలోని స్తూప శిలాస్తంభముల మీద కొన్ని చెక్కడపు పనులు గలవు. అందలి ఒక చిత్రములో ఒకానొక ప్రభువు, పడగలుగల శివలింగముపై పాదమును మోపి త్రొక్కు చున్నట్లు చిత్రింపబడినది. ఈ సన్నివేశము వీరపురుషదత్తుని వైదికమత ద్వేషమునే చిత్రించుచున్న దని యూహ చేసి నారు. ఇది యెట్లున్నను ఇక్ష్వాకుల కాలమునందు ఆంధ్ర బౌద్ధము పరమోన్నత స్థితికి వచ్చెను. శ్రీ పర్వత సంఘా రామముయొక్క పేరు బౌద్ధప్రపంచమంతటనుమారుమ్రోసెను. ప్రభువులేగాక ప్రజలును, పురుషులేగాక స్త్రీలునుకూడ బౌద్ధ సంఘమునకు అనుయాయులై మిక్కుటముగా ధనమువెచ్చించి బౌద్ధసంఘారామములను, స్తూపములను, చైత్యములను నిర్మించు

చుండిరి. వీరపురుషదత్తుని మేనత్తలును, ఆతని యంతఃపుర స్త్రీలును బౌద్ధసంఘముల కెన్నియో దానములు చేసినట్లు శాసనములు గలవు. విజయపురీనివాసియైన యొక సంపన్నురాలైన భక్తురాలు బోధిశ్రీ యనునామె దేశదేశాంతరముల నుండివచ్చు బౌద్ధభిక్షువుల వసతికై ఎన్నోకట్టడములు కట్టించి దానములు చేసినట్లు శ్రీపర్వతశాసనములలో కలదు.

ఇక్ష్వాకుల వంశము త్వరలోనే తన ప్రతిభ చాలించెను. వీరపురుష దత్తుని కుమారుడైన వాసిష్ఠీ పుత్రి శ్రీబాహుబల శాంతమూలుల కాలములో (239–252) ఈ వంశము పల్లవుల దాడులకు లొంగిపోయెను. బాహుబలుడు తండ్రివలెనే బౌద్ధాభిమానియై యుండెను. ఆ కాలమున వైదిక బ్రాహ్మణ మతము గొప్పశక్తితో విజృంభించుట కారంభించెను. ఇక్ష్వాకు ప్రభువులలో కడపటి వారిద్దరును బౌద్ధులగుటచే వారికిది ప్రతిస్పర్థియై యుండనోపును. ప్రథమ పల్లవ ప్రభువులైన వీరకూర్చుడును శివస్కంద వర్మయు మహాయోధులగుటచే ఇక్ష్వాకు వంశము పల్లవుల బారికి తాళలేక పోయెను. పల్లవులు కృష్ణానది వరకుగల దక్షిణాంధ్ర దేశమును జయించి ఇక్ష్వాకుల నంత మొందించిరి. ఇక్ష్వాకుల పాలనమున ఆంధ్రదేశము సుఖపడెననియె చెప్పవచ్చును. వారు తమ పూర్వాధిపతులైన శాతవాహనుల రాజ్యపద్ధతులనే ప్రచారములో నుంచిరి. వీరి శాసనములలో మహాసేనాపతి, మహాతలవరి మున్నగు అధికారుల పేర్లు కనబడుచున్నవి. మహాతలవరినే మహాతగవరియని

కూడ పిలుచుచుండిరి. ఈ యధికారి న్యాయాధీశుడుగ తోచును. ఇక్ష్వాకుల శాసనములు ప్రాకృత భాషలో నున్నవి. కావున ఆ కాలమున రాజభాష ప్రాకృతమని చెప్పవచ్చును.

## బృ హ త్ఫ లా య ను లు.

ఇక్ష్వాకుల పతనమునుండి విష్ణుకుండిన వంశము ఆంధ్ర దేశాధి పత్యము వహించు వరకుగల నడుమంత్రపు కాలమున (250–420) దక్షిణాంధ్ర దేశము తరచు పల్లవుల పరిపాలనలో నుండజొచ్చెను. దేశము పల్లవాక్రాంతము కాకుండ స్థానికులగు ఆంధ్రరాజులు దేశాభిమానముతో పోరు సాగించుచున్నను వారి యత్నములు విజయవంతములు కాలేదు. ఆంధ్రదేశముపై పల్లవాధి పత్యమును ఇట్లు ప్రతిఘటించిన వారిలో బృహత్ఫ లాయనులు, ఆనంద గోత్రీకులును ప్రశంసార్హులు. బృహత్ఫ లాయన వంశములో ప్రసిద్ధుడైన రాజు జయవర్మ మహారాజు. ఈతడు క్రీ. వె. 270–285 నడుమ విజృంభించి దక్షిణాంధ్ర దేశమునుండి పల్లవులను పారద్రోలి స్వతంత్రాధిపు డయ్యెను. జయవర్మ మహారాజు తాను 'మహేశ్వర పాదపరిగృహీతు'డని చెప్పుకొనినాడు. ఈతని రాజ్య విశేషములు తెలియవు. బృహ త్ఫలాయన వంశము ఆంధ్ర శాతవాహన చక్రవర్తుల కాలము నుండియు ఉన్న ఒక సామంతకుటుంబముగా తోచుచున్నది. వీరు తూర్పు తీరమున కృష్ణానది ముఖప్రాంతమందు కోస్తాను రక్షించుటకు స్థాపింపబడిరి. సుదీర్ఘమైన ఆంధ్రదేశపు కోస్తా

ప్రదేశమును సంరక్షించుటకు శాతవాహన చక్రవర్తులు పలు వంశముల వారిని నియోగించినట్లు కాన్పించుచున్నది. వీరిలో మరకాలనువారు గోదావరి ముఖప్రాంతమును, బృహత్ఫలాయనులు కృష్ణానదీ ముఖమును కాపాడుచుండిరి. మరకాలనువారు ఆ కాలములో ప్రసిద్ధ నావికులుగనుండి యుందురు. వీరిప్పుడు చేపలుపట్టు పల్లెవారుగ మాత్రము కాన్పించుచున్నారు. బృహత్ఫలాయన వంశమువారి ముఖ్యపట్టణము కోడూర అని తెలియవచ్చుచున్నది. కోడూర నగరము క్రీస్తు ప్రథమ శకములందు సుప్రసిద్ధ రేవుస్థానముగా నుండియుండెను. గ్రీకు భూగోళ శాస్త్రజ్ఞుడైన టాలమీయను నాతడు కృష్ణానదీ తీరమునందు మూడు ప్రధానములైన రేవు పట్టణములను, వర్తక స్థలములను పేర్కొనెను. అందు కోడూర, ఘంటసాల, అల్లోసిగ్నే (అవనిగడ్డ?) అను నగరములు ప్రసిద్ధ నౌకా వ్యాపారస్థానములై యుండెను. కోడూర ఇప్పుడు మచిలీపట్టణ ప్రాంతమందలి ఒక చిన్న పల్లెటూరుగా కాన్పించుచున్నది. ప్రాచీనాంధ్ర నౌకాస్థానములలో పాలూరను పట్టణము ప్రాధాన్యత వహించెను. ఈ నగరము గోదావరి ముఖమునందుండి యుండినట్లు గ్రీకు భూగోళ శాస్త్రజ్ఞుల వర్ణనలను బట్టి యూహింపబడినది. బృహత్ఫలాయన జయవర్మ మహారాజు కోడూర హారమందలి యొక గ్రామమును బ్రహ్మదేయముగ చేసి యొక బ్రాహ్మణునకు దానము చేసినట్లు తామ్రశాసనము వలన తెలియవచ్చుచున్నది. ఇట్టి దానములు

సర్వపాప పరిహారముగ నుండెడివి. ఈ మహారాజు శాసనము ప్రాకృతములో నుండుటచే ప్రాకృత మింకను రాజభాషగా చెల్లుచుండెనని యూహించ వచ్చును. బృహత్ఫలాయన వంశము జయవర్మ మహారాజుతోనే అంతమొంది యుండవలెను. తిరిగి పల్లవరాజులు దక్షిణాంధ్రముపై తమ ధ్వజమును ఎగుర వేయ జొచ్చిరి.

## ఆ నం ద గో త్రి కు లు.

బృహత్ఫలాయనుల యనంతరము ఆనంద గోత్రీకులైన రాజన్యులు పల్లవుల యాధిపత్యమును ప్రతిఘటించుచు వాసి గాంచిరి. ఆ రాజకుటుంబము కృష్ణకు దక్షిణమున పరిపాలన చేయుచు, ఒక్కొక్కప్పుడు స్వతంత్ర స్థితిలోను మరికొంత కాలము సామంత స్థితిలోను రమారమి మూడున్నర శతాబ్దములు (290–630) ఆంధ్రభూమిపై తన స్మృతి చిహ్నముల చిత్రించెను. ఆనందగోత్రికులు విజయ కందర పురమునుండి ఆంధ్రదేశమును పాలించుచుండిరి. పురాణములు ఈ వంశమును గోలాంగూలులని వాకొనుచున్నవి. ఆనందరాజుల విజయ ధ్వజముమీద గోలాంగూలము చిహ్నితమై యుండెడిదట. ఆనంద మహర్షి మహాయాన బౌద్ధమునకు చెందిన యొక ఆంధ్రాచార్యుడు. ఆనంద ప్రభువులు ఈ మహానీయునిచే ప్రేరితులై యుండవచ్చును. ఆనందవంశము బృహత్ఫలాయన వంశము వలెనే తూర్పు సముద్రపు కోస్తాను రక్షించుటకు

నియమింపబడిన సామంత కుటుంబము. వీరు కృష్ణకు దక్షిణ మున స్థాపింపబడిరి. దామోదరవర్మ మహారాజు ఈ వంశములో ప్రసిద్ధి చెందిన ప్రభువు. ఈతడు బౌద్ధమతావలంబకుడుగా కాన్పించును. ఐనను ఆతడు బ్రాహ్మణులకు అగ్రహారమును దానముచేసి శాసనము వ్రాయించెను. ఆనందరాజుల ముఖ్య పట్టణమైన కందర పురము ఇప్పుడు ఆ పేరుతో కాన్పించదు. నరసారావుపేట తాలూకా యందలి చేజెర్ల గ్రామమే పూర్వపు కందరపురమై యుండునని తోచుచున్నది. ఈ గ్రామములో ప్రాచీన శిథిలములు పెక్కులు కలవు. దామోదరవర్మ మహారాజు (295–315) నడుమ పరిపాలించినట్లు ఊహించ నగుచున్నది. ఈ కాలమున పల్లవరాజులు కదంబవంశ స్థాపకుడైన మయూరశర్మతో యుద్ధములందు చిక్కుకొని యుండిరి. ఈ అవకాశమును గైకొని దామోదరవర్మ మహారాజు దక్షిణాంధ్రదేశము నందు పల్లవుల యాధిపత్యమును తుదముట్టించెను. ఆనంద వంశమునందు దామోదరవర్మ తరువాత మరి నూరుసంవత్సరములకు అత్తివర్మ యను శూరప్రభువు తన వంశౌన్నత్యమును తిరిగి ప్రతిష్ఠించి పల్లవులనుండి కృష్ణకు దక్షిణమున గల దేశమును స్వతంత్రము గావించెను. ఆనంద రాజులకు వేంగీపుర పాలకులైన శాలంకాయన రాజులు ప్రతిస్పర్థులుగ నుండిరి. శాలంకాయనులు పల్లవులతో మైత్రి పాటించి ఆనంద వంశీయులను అణచివైచిరి. ఇట్లు ఇద్దరు బల వంతుల నడుమ ఆనంద గోత్రికులు చిరకాలము స్వతంత్ర

ముగా నుండజాలక పోయిరి. అయినను, ఈ వంశము బొత్తిగా రూపుమాసిపోక చిరకాలము ఆంధ్రప్రజలను పాలించి వారికి ప్రియమైయుండెను. తూర్పు చాళుక్య వంశ నిర్మాతయైన కుబ్జవిష్ణు వర్ధనుడు ఆ ప్రాంతమున ఆంధ్రదేశములో నెలకొని పల్లవులను తరిమివైచెను. ఆనందగోత్రికుల రాజ్యముకూడ అప్పుడే యంత మొందెను.

## శా లం కా య ను లు

శాలంకాయన వంశమువారు క్రీ. వె. మూడవశతాబ్దా రంభమున చారిత్రక ప్రాముఖ్యతనొందిరి. బృహత్ఫలాయనుల వలెనే శాలంకాయనులుకూడ ప్రాచీనకుటుంబముగా కాన్పించు చున్నారు. గ్రీకు భూగోళజ్ఞుడైన టాలమీాయను నాతడు శాలంకాయనులు గోదావరికి పశ్చిమప్రాంతమున పాలించు చున్నట్లు పేర్కొ-నెను. క్రీ. వె. 60 సంవత్సరములనాటి పెరి ప్లిసు అను గ్రంథములోకూడ శాలంకాయనుల ప్రశంస వచ్చి యుండుటచేత వీరు ఆంధ్రశాతవాహనులకాలమందే ఒక సామంతప్రభుకుటుంబముగా నున్నట్లు తోచుచున్నది. బృహ త్ఫలాయనులవలె వీరును సముద్రతీరమును కాపాడుటకును దేశ మందలి నాటురహదారులను రక్షించుటకును నియోగింపబడి యుందురు. ఆనాటిసామంతరాజకుటుంబములలో మూాసికులు, కౌశికులు, హిరణ్యాకులు మున్నగువారుకలరు. మూాసికులు హైదరాబాదురాజ్యముగుండ ప్రవహించు మూాసినదీప్రాంత

వాసులు. వీరినగరముపేరు మూసికనగరము. కృష్ణాముఖమం దలి కోడూరనగరమునుండి బయలుదేరిన నాటుబాట (మహా పథము) ధాన్యకటకము, విజయపురిమీదుగా మూసికనగర మును స్పృశించి గోదావరిమీద ప్రతిష్ఠానము, పశ్చిమతీర మందలి భరుకచ్ఛమువరకు సాగుచుండెను.

శాలంకాయనులు గోదావరీకృష్ణానదులమధ్యదేశమును పాలించిరి. వారిముఖ్యపట్టణము వేంగీపురము. ఇప్పటి ఏలూరు సమీపమందలి పెదవేగి, చినవేగి, దెందులూరు అను గ్రామ ములే ప్రాచీన వేంగిపురపు అవశిష్టములు. వీనిచుట్టుపట్ల పాడు పడిన శివాలయములును శిథిలభవనములును ఎన్నోగలవు. శాలంకాయనుల కులదైవము వేంగీపురమందలి చిత్రరథస్వామి. తాము చిత్రరథస్వామి పాదానుధ్యాతులమని శాలంకాయన ప్రభువులు శాసనములలో నుదహరించుకొనిరి. ఈవంశము వారు బృహత్ఫలాయనులు, భారద్వాజగోత్రపల్లవులవలె బ్రాహ్మణులుగ కన్పించుచున్నారు. ఇక్ష్వాకులును కదంబ వంశీకులునుగూడ బ్రాహ్మణులుగా పరిగణింపబడిరి. శాలంకా యనులు నాల్గవశతాబ్దారంభమున ఆనందగోత్రీకుల నడంచి వేంగీరాజ్యస్థాపకులైరి. వీరు పల్లవులతో సంబంధబాంధవ్య ములు కలవారై వారికి మిత్రులైయుండిరి. కావున, వీరు కృష్ణకు దక్షిణమునగల యాంధ్రదేశమున పల్లవుల యాధిపత్యమును సహించి యూరకుండిరి.

శాలంకాయనవంశమునందలి మొదటిప్రభువు విజయదేవవర్మయను నాతడు (300—335) దిగ్విజయముచేసి అశ్వమేధయాగమును చేసెను. ఈతనిరాజ్యము ఉత్తరమున దక్షిణకోసలమును లోగొనియుండెను. వాకటకుల సామ్రాజ్యము ఈతనిరాజ్యపు టుత్తరపుసరిహద్దు. పశ్చిమమున కదంబరాజ్యమును, దక్షిణమున పల్లవరాజ్యమును శాలంకాయన రాజ్యమున కెల్లలు. తూర్పున సముద్రమే ఈరాజ్యమున కవధిగా నుండెను. ఈ సువిశాలరాజ్యమును స్థాపించుకొన్న విజయదేవవర్మమహారాజు అశ్వమేధయాగము చేయుటలో అతిశయోక్తి యుండదు. ఈతనికాలమునందే ఉత్తరమున గుప్తసామ్రాజ్యము తలయెత్తెను. శాలంకాయన బ్రాహ్మణవంశముతో వైదికమతము చేయికలిపి అచిరకాలములో విజృంభించెను. ఇక్ష్వాకులును, ఆనందగోత్రీకులును బౌద్ధాభిమాను లగుటచే బలవత్తరమైన రాజ్యములు నిర్మింపలేకుండిరని యూహించుట సమంజసము. శాలంకాయనవంశమందలి హస్తివర్మప్రభువు కాలమునందే (335—350) సముద్రగుప్తుని దక్షిణదేశపు దిగ్విజయము జరిగియుండెను. హస్తివర్మమహారాజు అనేక దక్షిణాధిపతులను గలిపికొని సముద్రగుప్తునిదండయాత్రను ఎదుర్కొని నట్లు కాన్పించుచున్నది. శాలంకాయన నందివర్మమహారాజు వివిధమతాభిమానముగలవాడై సమదృష్టియు న్యాయబుద్ధియు గల ప్రభువుగా ప్రసిద్ధిచెందెను. ఈతడు వివిధధర్మప్రధానః, అని వర్ణింపబడినాడు. శాలంకాయనవంశము క్రీ. వె. 420

ప్రాంతమున విష్ణుకుండినవంశమువారిధాటికి నిలువలేక అస్త మించెను.

శాలంకాయనవంశమువారు ప్రజానురంజకులైన పరిపాలకులని చెప్పవచ్చును. వీరు బ్రాహ్మణుల కనేక అగ్రహారములు దానముచేసిరి. వీరిశాసనములందు ఆయుక్తకుడు, వల్లభుడు, దేశాధిపుడు, రాజపురుషుడు మున్నగు రాజ్యాధికారులు పేర్కొనబడిరి. శాలంకాయనరాజ్యమునందలి ప్రసిద్ధరేవుపట్టణము ప్రాలూరు. ప్రాలూరనగా ధాన్యపుకొఠారు అని చెప్పవచ్చును. ఇది గోదావరీముఖమునం దుండెడి గొప్పనౌకాశ్రయము. ఇప్పు డిది సముద్రగర్భములో పడిపోయినది. శాలంకాయనమహారాజులు పరమమాహేశ్వరులును పరమభాగవతులును అయినను వారు మతసహనముగలిగి వివిధధర్మప్రధానులయి యుండిరి. వారు బౌద్ధమతమును సహనదృష్టితోచూచి బౌద్ధాచార్యులకు పోషణ మిచ్చుచుండిరి. అయినను బౌద్ధమతము ఈ శతాబ్దములో ఆంధ్రదేశమునందలి తనస్థానమును క్రమముగా గోల్పోవజొచ్చెను. ఆమతము శాలంకాయనరాజ్యమునుండి తూర్పుసముద్రదీవులకును బర్మా, సయాము, కంబోడియా మున్నగు దేశములకును ప్రాకజొచ్చెను. బౌద్ధభిక్షువులతోపాటు ఆంధ్రనౌకావ్యాపారము ఆంధ్రశిల్పముకూడ దూరప్రాచ్యదేశములకు గొనిపోబడి యాంధ్రులకీర్తివైభవములను దేశాంతరములలో నెలకొల్పెను.

## విష్ణుకుండినులు

శాలంకాయనవంశమునకు స్వస్తి చెప్పి సమగాంధ్రము నకు నిర్వివాదప్రభువులై రెండుశతాబ్దములు దక్షిణాపథము నందు పరభయంకరులుగ పాలించినవారు విష్ణుకుండినవంశీయులు. ఈ విష్ణుకుండిను లెవరు, వీరు ఆంధ్రులేనా అను విషయముపై విద్వాంసులు భిన్నాభిప్రాయులై యుండజొచ్చిరి. వీరు మధ్యపరగణా ప్రాంతములపాలించిన వాకటకచక్రవర్తుల అనుయాయులాఅని కొందరు చారిత్రిలు తలచుచున్నారు. కాని విష్ణుకుండినులు అచ్చమయిన ఆంధ్రులుగానే తోచుచున్నారు. వీరివంశమున కీపేరు వారి ప్రథమనివాసస్థానమైన విష్ణుకుండిన పురమునుండికలిగియుండును. విష్ణుకుండినపురముయొక్క ఆధునికరూపము నేటి వినుకొండపట్టణము. విష్ణుకుండినచక్రవర్తులు తమ బిరుదావళిలో 'త్రికూట మలయాధిప' అని చేర్చుకొనుచుండిరి. ఈ త్రికూటపర్వతము వినుకొండసమీపమునందున్న కోటప్పకొండయను పుణ్యక్షేత్రము. మరియు ఈ మహారాజులు తాము 'భగవతః శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతు' లని ప్రకటించిరి. శ్రీపర్వతము కర్నూలుజిల్లాయందలి శ్రీశైలము. విష్ణుకుండినయుగమందే శ్రీశైలమల్లికార్జునుడు ప్రాముఖ్యతకు వచ్చియుండును. ఈ శ్రీపర్వతము బౌద్ధక్షేత్రమైన శ్రీపర్వతము కాదు. విష్ణుకుండినవంశము ఆంధ్రదేశమునందలి కర్మరాష్ట్రములో తలయెత్తి, శాలంకాయనవంశమును నిర్మూలించి పల్లవులకు ప్రక్కలోబల్లెమై రెండువందలసంవత్సరములు పాలించెను.

విష్ణుకుండిన వంశములో పలువురు ప్రసిద్ధులును సమర్థులును అగు చక్రవర్తులు జనించిరి. వారిలో మాధవవర్మ నామధేయులు ముగ్గురు కాన్పించుచున్నారు. మొదటి మాధవ వర్మ (420–455) చక్రవర్తి ఈ వంశస్థాపకుడు. ఈతడు మహాశూరుడు. శాలంకాయన వంశమును అంతమొందించి, అనేక క్షుద్రసామంతులను అణచివైచి మాధవవర్మ ప్రభువు తన బలమును వృద్ధిచేసికొని దక్షిణాంధ్ర దేశమునుండి పల్లవులను సమూలముగ పెరికివైచెను. ఇది సామాన్య కార్యముకాదు. కృష్ణానదికి దక్షిణమున ఉన్న ఆంధ్రభాగము శాలంకాయనుల కాలములో శాశ్వతముగ పల్లవాక్రాంతమయ్యెను. పల్లవులును శాలంకాయనులును మిత్రులగుటచే ఆ రాజులు పల్లవాధిపత్యమును నిరోధింపలేకపోయిరి. ఇట్లు దేశము వివిధ ప్రభుత్వములకులోనై తన రాజకీయైక్యతను పోగొట్టుకొనెను. శూరాగ్రేసరులును, దేశభక్తి పూరితులును అగు విష్ణుకుండిన చక్రవర్తులు ఈ స్థితిని సహించక పల్లవులకు తీవ్ర ప్రతిస్పర్థులై వారిని పెన్నకు దక్షిణమునకు తరుము వరకును నిద్రపోలేదు. ఇట్లు ఈ వంశమువారి ఆధిపత్యమున ఆంధ్రదేశము శాతవాహనుల నాడు ఇక్ష్వాకుల నాడు అనుభవించిన రాజకీయైక్యతను, సమగ్ర వైభవమును తిరిగి ప్రతిష్ఠించుకొనెను. ఇంతేకాక విష్ణుకుండిన చక్రవర్తులు తమ ఖడ్గతీక్ష్ణత చేతను, రాజనీతి చేతను ఆంధ్రదేశము పేరు ఉత్తరాపథమునందు కూడ మారుమ్రోగించిన రాజన్యులు. ఒకటిన్నర శతాబ్దము కునికిపాట్లు పడు

చున్న ఆంధ్రపరపతికి వీరొక మహోన్నత స్థాయి నొసంగిరి. మొదటి మాధవవర్మ ప్రభువు అరిభయంకరుడై దిగ్విజయము చేసి పదునొకండు అశ్వమేధములను, రాజసూయము, పురుష మేధము ఇంకను ఇతర మహాక్రతువులును నిర్వర్తించెనట. మాధవవర్మ యొక్క విజృంభణము చూచి యాతని మైత్రిని కాంక్షించి వాకటకులు తమ యాడుబిడ్డను ఆతనికి పరిణయము చేసి మైత్రి కలుపుకొనిరి. వాకటకులు అంతకుముందే ఉత్తరా పథమందలి గుప్త వంశముతో సంబంధ బాంధవ్యములు కలిగి యుండిరి. దక్షిణము నందలి కదంబులు వాకటక రాజునకు తమ కన్యకను పెండ్లిచేసి వారితో మైత్రి పాటించిరి. ఇట్లు ఆ కాలపు మహారాజ కుటుంబములు బీరకాయ పీచువలె అల్లుకొని పోయినట్లు కాన్పించుచున్నది.

విష్ణుకుండినుల విజృంభణము క్రమముగ నిరంతరాయముగ సాగిపోయెను. వారు కళింగమును కూడ జయించి తమ పాలనలో నుంచుకొనన జొచ్చిరి. ఈ కాలమునందే తూర్పు గాంగ వంశము మొలకెత్తి కళింగాధిపత్యమునకై వీరితో పెనగులాడ జొచ్చెను. బలవత్తరమైన వాకటక సామ్రాజ్యము క్రీ. వె. 510 ప్రాంతమున కూలిపోవగా విష్ణుకుండినులు ఇంకను బలవంతులై ఉత్తరాపథ వ్యవహారములందు కూడ తమ ఖడ్గ చాలనము గావించినట్లు నిదర్శనములు కలవు. పల్లవులను పారదోలి విష్ణుకుండిన ప్రభువు రెండవ మాధవవర్మ అమరావతీ పట్టణమును తన రాజధానిగా చేసికొనెను. పల్లవాధిపత్యమున

వారి రాజప్రతినిధి ధాన్యకటకములో నుండజొచ్చెను. శాతవాహన చక్రవర్తుల మహానగరమును రాజధానిగా చేసికొని విష్ణుకుండినులు ప్రాచీనాంధ్ర వైభవమును పునః ప్రతిష్ఠించిరి.

ఈ వంశము నందలి మూడవ మాధవవర్మ చక్రవర్తి (546–611) కాలములో విష్ణుకుండిన తేజము దుర్నిరీక్ష్యమై యుండి క్రమముగ అస్తమించెను. ఈ రాజన్యుడు చిరకాలము రాజ్యము చేయుటయేకాక ధర్మప్రభువని కీర్తికాంచెను. ఇతడు ప్రజారంజకు డగుటచే 'జనాశ్రయ' బిరుదున కర్హుడయ్యెను. ఈతని న్యాయబుద్ధి మిక్కిలి కొనియాడ బడినది. తన కుమారుడు నేర మొనరించగా పక్షపాతము వహింపక ఈ సమబుద్ధియైన చక్రవర్తి వానిని శిక్షింప, విజయవాడయందు నెలకొన్న మల్లేశ్వర దేవుడు ఈతని పట్టణమందు సువర్ణ వర్షము కురిపించెనట. ఈతని రాజ్యావసాన కాలమున అనగా క్రీ. వె. 611 సం॥ ప్రాంతమున చాళుక్య సముద్రము దక్షిణాపథముపై వెల్లివిరిసి విష్ణుకుండిన రాజ్యమును కూడ ముంచెత్తెను. చాళుక్య చక్రవర్తియు మహావీరుడును అగు రెండవ పులకేశి దక్షిణాపథమునందు ఏకచ్ఛత్రాధిపత్యమును నెలకొల్పగోరి దిగ్విజయము నారంభించెను. ఈతని విజయ సైన్యములు కోసలమును జయించి, అంతఃకలహములకు లోనైన కళింగమును అనాయాసముగా కబళించివైచి పిష్ఠపురమును ముట్టడించెను. విష్ణుకుండినుల సామంతులు శత్రువుకు మనస్ఫూర్తిగ విరోధించక పోవుటచే యాతని విజయ పరంపరకు అడ్డు లేకపోయెను.

చాళుక్యులు గోదావరిని దాటి వేంగీదేశముపై పడిరి. సుదీర్ఘమైన కాలము ధర్మపరిపాలన చేసి వృద్ధుడైన మాధవవర్మ చక్రవర్తికి అవసాన దశయందు విషమపరీక్ష సంభవించెను. తరువాత కాలమందు విజయనగర సామ్రాజ్య చరమదశయందు వీరాగ్రణి యగు రామరాయుల వలెనే వృద్ధుడైన మాధవవర్మ ప్రభువు కవచమును ధరించి చాళుక్య వాహిని నడ్డగించి పోరుచు వీరస్వర్గ మలంకరించినట్లు కనబడును. ఈతని యనంతరము ఆంధ్రదేశము చాళుక్యులకు వశమయ్యెను. పులకేశి చక్రవర్తి తమ్ముడైన విష్ణువర్ధనుడు క్రీ. వె. 624 సం॥ ప్రాంతమున వేంగీదేశములో తూర్పు చాళుక్య వంశమును స్థాపించి స్వతంత్రు డయ్యెను.

విష్ణుకుండిన చక్రవర్తుల కాలము ఆంధ్రదేశ చరిత్రలో గర్వింపదగిన సమయము. ఆంధ్రదేశముయొక్క రాజకీయ ప్రతిష్ఠ మహోన్నతస్థితికి వచ్చుటయేగాక ప్రజలు సుఖభాగ్యముల ననుభవించిరి. ఈ వంశమువారు ఆంధ్రదేశమున కలంకారములైన శిల్పములను ప్రసాదించిరి. కృష్ణాతీరమందలి ఉండవల్లి, విజయవాడ, మొగలరాజపురము వద్దను, నెల్లూరు జిల్లాలోని భైరవుని కొండవద్దను, పర్వత గర్భములో దొలిచిన దేవాలయ శిల్పములు విష్ణుకుండిన చక్రవర్తుల కళారాధనకు తార్కాణములు. ఈ శిల్పములు పల్లవచక్రవర్తి మహేంద్రవర్మ నిర్మితములని చారిత్రికులు భ్రమపడుచుండిరి. పల్లవుల రాజ్యము ఆంధ్రదేశములో ఎన్నడును స్థిరముగా నుండలేదు.

బృహత్ఫలాయనులు, ఆనందగోత్రీకులును వారి ఆధిపత్యమును ప్రతిఘటించుచునే ఉండిరి. మరియు ఆదిపల్లవులు వైష్ణవులుగనో జైనులుగనో ఉండిరి. విష్ణుకుండిన దేవాలయములు శివారాధనకును లింగమునకును ప్రాధాన్య మిచ్చుచున్నవి. కావున ఇవి పల్లవ నిర్మాణములనుట పొసగదు. ఆంధ్ర జాతీయతకు ఒక ఉదారమైన స్థాయిని ప్రసాదించిన విష్ణుకుండిన చక్రవర్తులు దేశభాషయైన తెలుగునకు ప్రాముఖ్యత నీయక పోవుట కొంత విచారకరము. కాని ఆ యుగములో సంస్కృత భాషా ప్రభావము మెండుగ నుండెను. వైదిక మతము సంస్కృత భాషయు మహాశక్తితో విజృంభించు చుండుటచే విష్ణుకుండిన ప్రభువులును ఈ సంస్కృతికి తలయొగ్గి యుందురు. వారి శాసనములు సంస్కృతములో లిఖింపబడినవి. దేశభాషయందు శాసనములు వేయించి వాఙ్మయము నిర్మింపించిన గొప్పకీర్తి విష్ణుకుండినుల యనంతరము ఆంధ్రదేశ పాలకులైన తూర్పు చాళుక్యులకు చెందినది.



# ఆంధ్రుల చరిత్ర

## పల్లవులు

### పల్లవు లెవ్వరు ?

శాతవాహన వంశీయుల తరువాత ఆంధ్రదేశమున రాజ్యము కావించిన వారిలో పల్లవు లొక్కరు. వీరి పుట్టు పూర్వోత్తరములగూర్చి చరిత్రకారులలో భిన్నాభిప్రాయములు కలవు. కాని పలువురీ పల్లవులు విదేశీయులనియు, క్రీ. వె. రెండవ శతాబ్దియందు హిందూదేశముపై దాడి వెడలిన జాతులలో వీ రొకరనియు, వీరీ దేశములో స్థిరనివాస మేర్పరచుకొని, అటుపైన వైదికమతము నవలంబించి దేశీయులలో లీనమై పోయిరని తలంచుచున్నారు. పురాణములందును, శాసనములలోను, పల్లవులు భారత వీరుడగు నశ్వత్థామకును, ఒక అప్సరస్త్రీకిని జన్మించిన యొక మూలపురుషుని వంశీయులని తెలుపబడి యున్నది. కాని చారిత్రక దృష్టిలో నిట్టి గాథలు విశ్వసనీయములు కాజాలవు.

### పల్లవ రాజులు.

ఈ పల్లవ వంశమున మొదటి రాజు శివస్కందవర్మ. ఈ రాజు క్రీ. వె. మూడవ శతాబ్ది తుది భాగములో రాజ్య

పాలనము చేసి నట్లూహింప బడుచున్నది. ఈతడు వైదిక మతాభిమాని యని యీతని శాసనముల వలన దేలుచున్నది. ఈతని తరువాత పల్లవ రాజన్యులు పలువు రాంధ్రదేశమును పరిపాలనము చేసిరి. వీరిలో చాలమంది వైదిక మతమును పోషించి బ్రాహ్మణులకు దానములుచేసి శాసనములలో నా విషయమును ప్రకటించిరి. వీరిలో కొందర రశ్వమేధ యాగ మును కూడ చేసినట్లు తెలియనగు చున్నది. ఈ పల్లవరాజులు తమ యధికారమును దేశమంతటను స్థాపింపజాలక పోవుట వలన వివిధ ప్రాంతములలో వేర్వేరు రాజ్యములు నెలకొనెను. పల్లవులకును చాళుక్యులకును నిరంతర యుద్ధములు జరుగు చుండెను. చాళుక్యులు ఆరవశతాబ్ది తుది భాగమున నాంధ్ర దేశముపై దండెత్తి వచ్చి యిచ్చట చిన్న చిన్న రాజ్యముల నేర్పాటు చేసికొని పరిపాలనము సల్పుచున్న పల్లవుల నోడించి తరిమివైచిరి. ఇట్లు పారిపోయిన పల్లవరాజులలో కొందరు దక్షిణదేశము నందలి కాంచీపురమును రాజధానిగ చేసికొని మరికొంత కాలము రాజ్యము కావించిరి.

## ఆనాటి మతములు

పల్లవరాజుల కాలములో వేంగీపుర మాంధ్రదేశమున ఖ్యాతిగాంచిన పట్టణముగ తెలియనగుచున్నది. ఈ పట్టణము ప్రస్తుతము ఏలూరను పట్టణమునకు సమీపమున నుండెడిది. ఆ ప్రదేశములో నిప్పుడు పురాతన వైభవ చిహ్నములు మాత్రము కాంచనగును. ఈ పల్లవరాజుల రాజ్యకాలమున

కాంచీపురము కూడ మిక్కిలి ప్రసిద్ధి చెందెను. ఈపట్టణము వేద వేదాంగ పారీణులైన బ్రాహ్మణులకు నివాస స్థలముగను, వైదికమతమునకు కేంద్రముగను ఉన్నట్లు తెలియుచున్నది. అప్పటికి ఆంధ్రదేశమున బౌద్ధమతము, శైవమతమును అధిక వ్యాప్తిలో నుండెను. గోదావరిజిల్లా యందు తాటిపాక, నేదునూరు మున్నగు చిన్న గ్రామములలో నేటివరకును జైన విగ్రహములు కాన నగుచున్నవి. విశాఖపట్టణము, కృష్ణ, గుంటూరు మండలములలో కూడ జైనమత చిహ్నములు నేటికిని కానవచ్చుచున్నవి. ఈ చారిత్రిక నిదర్శనముల వల్ల ఆంధ్రదేశమున నొకప్పుడు జైనమత ప్రచారము విస్తారముగ నుండెనని యూహించుట కాధారము లేర్పడుచున్నవి. కాని పల్లవరాజులుమాత్రము వైదిక మతాభిమానులుగ నుండిరి. అయినను వీ రితర మతస్థులను బాధించినట్లు కాన్పింపదు. పల్లవరాజుల కాలములో వైష్ణవమతము కూడ కొంత వ్యాప్తి గాంచినట్లు తెలియుచున్నది. ప్రాచీన వైష్ణవాళ్వారు లీకాలమందే ప్రసిద్ధి గాంచిరి. పల్లవరాజులలో కొందరు వైష్ణవమతము నవలంబించినట్లు కూడ నిదర్శనములు కలవు.

## కుమారిలభట్టు

ఏడవ శతాబ్దియందు ఆంధ్రదేశమున కుమారిలభట్టను ప్రసిద్ధ పండితుడు జీవించెను. ఈతడు ప్రస్తుతపు గంజాము మండలము నందలి యొక గ్రామమున జన్మించెను. ఈతడు ప్రాథమిక దశయందు మారువేషముతో జైన పండితులవద్ద

తన్మత సాంప్రదాయముల నెల్ల తెలిసికొని, తరువాత వాని నన్నిటిని ఖండించెను. ఈతడు జైన బౌద్ధ మతస్థులతో విశేష ముగ శాస్త్రవాదములు సల్పి వారి మతమును ఖండించు చుండెడి వాడని జైనులే యంగీకరించిరి. కుమారిలభట్టు జైమిని కృతములగు సూత్రములకు భాష్యము వ్రాసి కర్మ ప్రధాన మైన వైదికమతమునకు ప్రచారము కల్పించెను. కుమారిల భట్టుయొక్క ప్రయత్నములవలన వైదికమత మాంధ్రదేశ మున ప్రతిష్ఠితమై క్రమక్రమముగ జైన బౌద్ధ మతములను పూర్తిగ లోపింపజేసెను.

## సంఘస్థితి

ఆకాలమునందు బ్రాహ్మణులు సముద్రయానము బాహాటముగ చేయుచు దినములకొలది ఓడలలో ప్రయాణము చేయుచుండినట్లు చైనా యాత్రికుడగు ఫాహియాను వ్రాతల వలన తెలియ నగుచున్నది. ఆనాటికే బ్రాహ్మణులలో నియోగులన్న శాఖ యేర్పడెను. రాజకీయోద్యోగులలో నున్న బ్రాహ్మణులకు నియోగులన్న పదము చెందలూ రను ప్రదేశ మున దొరకిన కుమారు విష్ణువను రాజుయొక్క శాసనములో వాడబడినది.



# ఆంధ్రుల చరిత్ర

## 7 వ శతాబ్ది నుండి
## 12 వ శతాబ్ది యంతము వరకు

### చాళుక్యులెవరు?

పల్లవరాజుల యాధిక్యత క్షీణించిన తరువాత ఆంధ్రదేశముపై చాళుక్యులు రాజ్యపాలనము చేసిరి. పల్లవులయొక్క ప్రాబల్యము క్షీణించుటకు కూడ చాళుక్యుల ప్రాబల్యమే కారణము. ఈ చాళుక్యవంశము యొక్క ఉత్పత్తినిగూర్చి పురాణములలో విచిత్రమైన గాథలు కలవు. కాని చారిత్రక దృష్టితో చూచిన యెడల వీరుకూడ పల్లవుల వలెనే విదేశీయులనియు, ఇచ్చటికి వచ్చిన మీదట వీరు ఇచ్చటి ప్రజలలో కలిసిపోయి, వైదికమతము నవలంబించిరనియు తెలియఁగలదు. ఈ రాజుల నాశ్రయించిన బ్రాహ్మణులు తమ పోషకులను సంతోషపరచుటకై వీరిని సూర్య వంశీయులనియు, చంద్ర వంశీయులనియు గాథలను కల్పించి ప్రచారములోనికి తెచ్చిరని తలంచుట సత్యదూరము కానేరదు.

## పశ్చిమ చాళుక్యులు.

చాళుక్య వంశమునకు జయసింహ వల్లభుడను రాజు ప్రథముడుగ కాన్పించుచున్నాడు. ఈతడు ప్రస్తుతము బొంబాయి రాజధానిలోని వాతాపి (Badami) అను పట్టణమును రాజధానిగ చేసికొని పరిపాలనము కావించెను. ఈ వంశమునందు ప్రసిద్ధులైన రాజన్యులు పలువురు కలరు. కాని యీ వంశముతో నాంధ్రదేశమున కెక్కువ ప్రసక్తి లేదు. ఏలనన వీరు పరిపాలనము చేసినది కర్ణాట మహారాష్ట్ర ప్రాంతములలో కాని ఆంధ్ర దేశములో కాదు. ఈ వంశమును చరిత్రకారులు పశ్చిమ చాళుక్య వంశమని వర్ణించుచున్నారు. ఈ రాజవంశములోని యారవ ప్రభువు పృధ్వీవల్లభ మహారాజు. ఈతడు క్రీ. శె. 611 నందు సింహాసన మధిష్ఠించెను. ఈరాజు గొప్ప యోధుడని వర్ణింపబడి యున్నాడు. ఈతడు కళింగ వేంగీదేశములను జయించి, ఆ కాలములో ఆంధ్రదేశమున ప్రసిద్ధ దుర్గమగు పిష్ఠపురము (పిఠాపురము)ను స్వాధీనము చేసికొనెను. అప్పటి కీ ప్రాంతములందు పల్లవరాజులు ప్రభుత్వము చేయుచుండిరి. పృధ్వీవల్లభ చాళుక్యుడు పల్లవరాజ్యము నంత మొందించి, ఆంధ్రదేశమును తన రాజ్యములో కలుపుకొని అచ్చట పరిపాలనము చేయుటకై తన తమ్ముడగు విష్ణువర్ధనుని రాజప్రతినిధిగ నియమించెను. ఈ విష్ణువర్ధనుడు కొంత కాలమైన తరువాత స్వతంత్రుడై, ఆంధ్ర చాళుక్య వంశమునకు మూలపురుషు డయ్యెను.

## తూర్పు చాళుక్యులు.

ఈ విష్ణువర్ధనుడు మరుగుజ్జుగ నుండుటచేత కాబోలు ఈతనికి కుబ్జవిష్ణువర్ధనుడను పేరు కల్గెను. ఈతడు క్రీ. వె. 615 లో సింహాసనా రూఢుడై 18 సంవత్సరములు రాజ్యపాలనము కావించెను. ఈ విష్ణువర్ధనుని శాసనము లుత్తరమున విశాఖపట్టణము జిల్లాయందును దక్షిణమున గుంటూరు జిల్లాయందును కూడ కానవచ్చుచున్నవి. కావున నీతడీ ప్రాంతముపై రాజుగ నున్నట్లూహింప వలనుపడుచున్నది. ఈ ఆంధ్రచాళుక్యరాజులు బలసంపన్నులై తమ రాజ్యముపై దండెత్తిన రాష్ట్రకూటులను పలుమారులు వెనుకకు తరిమివైచిరి. ఈ వంశములోని ఏడవ విష్ణువర్ధనునికి రాజమహేంద్రుడని బిరుదనామముండెను. కావున రాజమహేంద్రవరమను నేటి పట్టణమును స్థాపించి దానిని రాజధానిగ చేసికొనిన మొదటిప్రభు వీతడే కావచ్చునని చారిత్రికు లూహించుచున్నారు. క్రీ. వె. పదవశతాబ్దియంతమున తూర్పుచాళుక్యులరాజ్యమం దరాజకత్వము ప్రబలెను. దక్షిణ దేశమునందు పరిపాలనముచేయుచున్న చోళులు వేంగీదేశముపై దండెత్తిరి. కాని ఈ యల్లరు లచిరకాలములో నడగిపోయెను. క్రీ. వె. 1015 నందు వేంగీరాజ్యమునకు పాలకుడై 1022 వరకును రాజ్యముచేసిన విమలాదిత్యునికాలమునను, ఆతనికుమారుడును, ఆంధ్రవాఙ్మయచరిత్రయందు ప్రసిద్ధుడగు రాజరాజనరేంద్రుని కాలమునను, వేంగీరాజ్యముయొక్క ప్రతిభ మరల విజృంభించెను.

## రాజరాజనరేంద్రుడు — ఆంధ్రభాష.

రాజరాజ నరేంద్రుడు విమలాదిత్యుని కుమారుడు. ఈతని తల్లి కుందనాంబాదేవి. ఈయమ చోళరాజగు రాజరాజచోడుని కుమార్తెయును, రాజేంద్రచోడుని చెల్లెలును అయినందున, తూర్పు చాళుక్యుల కీ వివాహ సంబంధమువలన ఎక్కువ బలమును ప్రతిష్ఠయును చేకూరెను. రాజరాజ నరేంద్రుడు పరాక్రమ వంతుడైన ప్రభువు. కావున నీతని రాజ్యకాలమున దేశమున నెట్టి బాధలును లేక శాంతి నెలకొని యుండెను. రాజరాజు 1022 సంవత్సరము మొదలుకొని 1063 వరకును రాజ్యపాలనము చేసెను. ఈతడు తన మేనమామ యగు రాజేంద్రచోడుని కుమార్తెయగు అమ్మంగదేవిని వివాహమాడెను. ఈ ప్రభువుయొక్క పరిపాలనమున దేశమునందెట్టి యుపద్రవములును లేక సుభిక్షముగ నుండుటవలన, రాజరాజు తన కాలము నంతను విద్యాగోష్ఠియందు గడపెను. శబ్దశాసనుడను విఖ్యాతిగాంచి మహాభారతమునందు సుమారు మూడు పర్వముల నాంధ్రీకరించిన మహనీయుడు నన్నయభట్టు రాజరాజుయొక్క ఆస్థానము నలంకరించెనను విషయము సుప్రసిద్ధము. నన్నయభట్టు భారతము ఆంధ్రభాషలో ప్రథమ కావ్యము అయినను కాకపోయినను ఈ మహాకవి ఆంధ్రభాషా సౌధమునకు పునాదివేసిన వాడని చెప్పుటలో యెంత మాత్రమును సందియములేదు. నన్నయ కృతమగు భారతమందలి విషయ గౌరవమును, భాషా ప్రాశస్త్యమును, శబ్దలాలిత్య

మును జగద్విఖ్యాతములు. భారత రచనము రాజరాజ నరేం ద్రుని తుది కాలములో ప్రారంభింపబడినట్లు తోచుచున్నది. నన్నయభట్టునకు పూర్వమో లేక నన్నయ మరణము సంభ వించిన కొలది కాలమునకో రాజరాజు గతించి యుండవలెను.

రాజరాజ నరేంద్రునికుమారుడు తన మాతామహ రాజ్యమైనచోడదేశము నాక్రమించుకొనుటలో నిమగ్నుడై వేంగీరాజ్యమును తనపినతండ్రికి విడిచెను. రాజరాజుకుమా రునికిని ఆతనితమ్మునికి వివాదములు సంభవించి, రాజ్యాంగ పాలన మశాంతికిలోనైనందున భారతరచన యాగిపోయి యుండవచ్చును. రాజరాజనరేంద్రునిచే గౌరవముపొందిన కవి మరియొకడుకలడు. ఈతడు పావులూరి మల్లనయను బ్రాహ్మ ణుడు. మల్లన ఆంధ్రభాషలో గణితశాస్త్రమును వ్రాసిన వాడు. వీరిరువురునుకాక రాజరాజనరేంద్రునిచే మన్ననలు బడసిన విద్వాంసులు పలువురుకలరు. ఈ భూపాలునికాల మాంధ్రచరిత్రయందు సువర్ణాక్షరములతో లిఖింపదగియున్నది. నేడాంధ్రలోకమునంతను ఏకసూత్రముచే బంధించి, ఏకో న్ముఖముచేయుచున్న ఆంధ్రభాషకు చక్కనిస్వరూపము నొసం గిన మహాకవికి పోషకుడైన యీప్రభువు మనకందరకును వంద్యుడును పూజనీయుడునుగదా!

## రాజేంద్రచోడుడు

రాజరాజనరేంద్రుని కుమారుడగు రాజేంద్రచోడుడు తనపినతండ్రియగు విజయాదిత్యుని వేగిరాజ్యమునకు పాలకునిగ

జేసి మాతామహపాలితమగు చోళరాజ్యమునకు ప్రభు వయ్యెను. చోళరాజ్యమునకు ప్రభువైనపిమ్మట నీతడు కులో త్తుంగచోడుడను బిరుదమును వహించెను. ఈరాజు పరాక్రమ వంతుడు కావున పశ్చిమచాళుక్యులను, కాళింగులను ఓడించి విశేషకీర్తిని సంపాదించెను. కులోత్తుంగచోడుడు తన పినతండ్రి యగు విజయాదిత్యుని మరణానంతరము రాజరాజచోడగంగు అను తనజ్యేష్ఠకుమారుని వేగిదేశమును పాలించుటకై పంపెను. కొంతకాలమైనతరువాత కులోత్తుంగుడు తనకుమారులలో మరి యొకనిని, ఆవెనుక కుమారతుల్యుడైన వెలనాటిచోడుని వేగి దేశమునకు పాలకులుగపంపెను. కులోత్తుంగుని మరణానంతర మీ వెలనాటిచోడుడును, ఆతనివంశీయులును ఆంధ్రదేశమునకు పాలకులైరి.

## వి వి ధ రా జ వం శ ము లు

వెలనాడనుప్రదేశము ప్రస్తుతము గుంటూరుజిల్లాయం దలి రేపల్లెతాలూకాలోని చందవోలుప్రాంతమని తెలియు చున్నది. వెలనాటిచోడులీప్రాంతమున రాజ్యపాలనముచేసిరి. ఈ వంశమువారు శూద్రులని తెలియుచున్నది. వీరు కొంత కాలము చోళులకును కొంతకాలము పశ్చిమచాళుక్యులకును సామంతులుగనుండి రాజ్యపాలనము చేసిరి. ఈ కాలమునం దాంధ్రదేశ మొక్కరాజు నధికారములోనుండక వివిధప్రాంత ములలో వివిధరాజ్యములు నెలకొనియుండెను. అట్లు పరిపాల నముచేసినవారిలో బేట విజయాదిత్యవంశము వారొక్కరు.

ఇట్లే హైహాయవంశమువారు కోనమండలమును పాలించిరి. కోనమండలము తూర్పుగోదావరిజిల్లాయందలి అమలాపురము రాజోలుతాలూకాప్రాంతములు. కడపమండలమునందు చోడులలో మరియొకవంశము రాజ్యపాలనముచేసెను. ఈ వంశము రేనాటి చోడవంశమనివర్ణింపబడినది. మహాబాణవంశీయులను మరికొందరు ప్రస్తుతపు మైసూరురాష్ట్రములోని కోలారుజిల్లా యందు రాజ్యముచేసిరి. ఇట్లే వైదుంబవంశము, నీలంబరాజవంశము అను వంశములకు చెందినవారు కోలారు, బళ్ళారి, కడప, కర్నూరుజిల్లాలయందు ప్రభుత్వముచేసిరి. పైన వర్ణింపబడిన వంశములవారందరును వైదికమతావలంబకులుగను, బ్రాహ్మణాభిమానులుగను ఉండి బ్రాహ్మణుల కగ్రహారములను విరివిగ దానముచేసినట్లు వీరిశాసనములవలన దెలియుచున్నది.

## ఆంధ్రదేశస్థితి.

పూర్వచాళుక్యులు, వారిసామంతులును రాజ్యపాలనము చేయుచున్నకాలములో ఆంధ్రదేశము సుభిక్షముగనున్నట్లు తెలియనచ్చుచున్నది. కాని దేశమునందు జనసంఖ్య మిక్కిలితక్కువగా నుండెను. అందును ముఖ్యముగ కడపజిల్లాయందు దేశము జననివాసమున కయోగ్యముగను, వ్యవసాయమున కననుకూలముగ నున్నట్లు చీనాయాత్రికుడగు యూవన్‌చంగ్ వ్రాతలవలన తెలియుచున్నది. ఈప్రాంతము బందిపోటుదొంగలకు నివాసస్థానముగనుండెను. పల్లవరాజు

లాంధ్రదేశమున రాజ్యముచేయుచున్నప్పుడే బ్రాహ్మణులలో నియోగులను నొకశాఖ యేర్పడినట్లు తెలుపబడినది. చాళుక్యుల పాలనలో బ్రాహ్మణులలో నితర విభాగములు స్థిరపడినట్లు తెలియవచ్చుచున్నది. వేగినాడు, వెలనాడు, తెలగనాడు మున్నగు నాడులలో నివసించు బ్రాహ్మణులాయా నాడి వారమని చెప్పుకొనుట యీ కాలమునుండియే ప్రారంభమైనట్లు తోచుచున్నది. ఈ కాలములో కృష్ణానదికి దక్షిణమున నున్న ప్రాంతము ఆఱువేలనాడని (షట్సహస్ర దేశము) పిలువబడుచుండెను. నేటికాలమున ఆఱువేల నియోగులని పిలువబడు బ్రాహ్మణశాఖ వారీ షట్సహస్ర దేశమునందు నివసించువారై యుండవచ్చును. ఈ శాఖవారు ఆ కాలమునందును తరువాతను కూడ రాజులకడ మంత్రిత్వము, దండనాయక పదవి మున్నగు నుద్యోగముల వహించి చాల ప్రఖ్యాతిని గాంచిరి.



# ఆంధ్రుల చరిత్ర

## చోడవంశములు

### మతకర్తలు.

క్రీ. వె. పండ్రెండవ శతాబ్ద మనేక నూతన మతములు స్థాపింపబడిన కాలము. క్రీ. వె. ఎనిమిదవ శతాబ్దియం దద్వైత మతస్థాపకుడైన శంకరాచార్యుడు జీవించెను. ఈతడు ఉపనిషత్తులు మున్నగు వానికి భాష్యమువ్రాసి జీవేశ్వరుల యేకత్వమును ప్రతిపాదించు ఒక నూతన మతమును స్థాపించి, దానికి ప్రచారమును జైన బౌద్ధమతములకు క్షీణతయు కలిగించెను. పదునొకండవ శతాబ్ది యంతమున రామానుజుడు జన్మించి విశిష్టాద్వైతమను మతమును ప్రతిష్ఠించెను. పండ్రెండవ శతాబ్ది మధ్యమందు వీరశైవ మతస్థాపకుడయిన బసవేశ్వరుడు జీవించెను. ఈతడు కళ్యాణపురమును రాజధానిగ చేసికొని పరిపాలనము చేసిన బిజ్జలుడను రాజువద్ద మంత్రిగ నుండెను. కాని కారణాంతరముల వలన నీతనికిని బిజ్జలునకును వివాదములు సంభవించి బసవేశ్వరుడు బిజ్జలుని చంపించెను. బసవేశ్వరుడు వీరశైవమను నూత్న మతమునకు పునాది నైచెను. పండ్రెండవ

శతాబ్ది తుదిభాగమున ద్వైతమత స్థాపకుడగు మధ్వాచార్యుడు జీవించి ద్వైతమతమును బోధించెను. ఈ మతము లన్నిటి యొక్క పరిభావమును ఆంధ్రదేశముపై పరిసరించినమాట వాస్తవమేకాని మొత్తముమీద నిచ్చట వైదికమతమే ప్రజానురాగమునకు విశేషముగ పాత్రమయ్యెనని చెప్పవచ్చును. పండ్రెండవ శతాబ్దినాటికి జైన బౌద్ధ మతములు చాలవరకు క్షీణించి యచ్చటచ్చట మాత్రము ప్రచారములో నుండెను.

## కొణిదెన చోడులు

ఆంధ్రచోడులకాలములో కొన్నివంశములవారు భాషాసేవజేసి శాశ్వతకీర్తిని గాంచియున్నారు. అట్టి రాజవంశముల గూర్చి తెలిసికొనుట యెంతయును ముఖ్యము. వీరిలో కొణిదెనచోడు లొక్కరు. కొణిదెన యనునది ప్రస్తుతము గుంటూరుమండలములోని నరసారావుపేటకు సమీపమునయున్న యొకగ్రామము. ఈగ్రామము పూర్వకాలములో ప్రసిద్ధిచెందిన యొక చోడరాజవంశమునకు రాజధానిగ నుండెను. ఆకాలములో దీనిని కొట్యచౌన యని పిలచెడివారు. ఈ వంశములో బల్లయచోడదేవుడను రా జొక్కడు పండ్రెండవశతాబ్దిప్రారంభములో రాజ్యపాలనముచేసెను. ఈ రాజును చోడబల్లియని కూడ చరిత్రవారులు వ్యవహరించుచున్నారు. కుమారసంభవమను నాంధ్రకావ్యమునురచించిన నన్నెచోడు డీ రాజుకుమారుడు. ఈ నన్నెచోడుడు నన్నయకుపూర్వమువాడని కొందరు పండితులవాదము. మరికొంద రీకవి నన్నయకు సమకాలీనుడు

కావచ్చునని యూహించుచున్నారు. నన్నెచోడుడు తన గ్రంథమును మల్లికార్జునయోగి కంకితముచేసెను. ఈ మల్లికార్జున యోగి బ్రాహ్మణుడు. ఈతడు పూర్వాశ్రమమున సైన్యాధిపతిగానో మంత్రిగానో యుండి తరువాత సన్యసించినట్లు తెలియుచున్నది. నన్నెచోడు డీ మల్లికార్జునుని గురువుగ భావించి యీతని యనుగ్రహమువలననే తనకు కవిత్వమును రచించు శక్తి యబ్బెనని తెల్పియున్నాడు. నన్నెచోడుని కుమారసంభవము నారికేళ పాకములో రచియింపబడినది. ఇందు తెనుగు భాషలో కానరాని మాఱుమూల పదములు తరచుగ కానఁగును. కాని మొత్తముమీద కవిత్వము మనోహరముగను, సలక్షణముగను ఉన్నదని పండితు లభిప్రాయ పడుచున్నారు. కొణిదెన చోడులు కాలక్రమమున తమ యౌన్నత్యమును గోల్పోయి కాకతీయ చక్రవర్తుల కాలములో వారికి కేవల సేవక మాత్రులై యుండజొచ్చిరి. వీరందరును శివభక్తులై పెక్కు శివాలయములను కట్టించిరి. వీరి యాధిపత్యమున భాషాసేవ కూడ జరిగినట్లు మనము తెలిసికొని యున్నాము.

## నెల్లూరి చోడులు.

ప్రస్తుతము నెల్లూరని పిలువబడు విక్రమ సింహపురిని రాజధానిగ జేసికొని తెలుగు చోడవంశము వారొకరు రాజ్యపాలనము చేసిరి. వీరు కొంతకాలము చోడ చక్రవర్తులకును, మరికొంత కాలము కాకతీయ చక్రవర్తులకును సామంతులై

యుండిరి. ఈ వంశము ఆంధ్రదేశ చరిత్రమందు ప్రత్యేక ప్రశంసకు పాత్రమై యున్నది. కవిబ్రహ్మయని పేరు మోసి ఆంధ్రమహాభారతము నందలి పదునైదు పర్వముల గ్రంథము ననన్య సామాన్య సామర్థ్యముతో రచించి తెనుగు భాషకు మహోపకారము కావించిన తిక్కన సోమయాజి ఈ వంశములో నొకడగు మనుమసిద్ధియను రాజుకడ మంత్రిగ నుండెను. ఈ వంశీయులు క్రీ. వె. పండ్రెండవ శతాబ్దియందు రాజ్యపాలనము చేసిరి. ఈ వంశమున తిక్క భూపతియను నాతడు మిక్కిలి ప్రసిద్ధిగాంచెను. తిక్కన సోమయాజి తాను రచించిన నిర్వచనోత్తర రామాయణమునం దీతని గొప్ప వీరునిగ వర్ణించెను. ఈ తిక్కభూపతి తనకు ప్రభునైన చోళభూపతిని శత్రువు లోడించి పదభ్రష్టుని చేయగా నాతనికి మరల రాజ్యము నిప్పించి చోళస్థాపనాచార్య యను బిరుదమున కర్హుండయ్యెనట. ఈ రాజు స్వయముగ విద్వాంసుడును, కవియునైనట్లు నిర్వచనోత్తర రామాయణము వలన తెలియుచున్నది. కాని యీతడు రచించిన గ్రంథము లేవియు కానరావు. తిక్కరాజు వద్ద సిద్ధనయను బ్రాహ్మణ పుంగవుడు మంత్రిగ నుండెను. సిద్ధన యింటిపేరు కొట్టరువు వారు. ఈతడు తిక్కన సోమయాజికి పెదతండ్రి. ఖడ్గతిక్కన యని ప్రసిద్ధిగాంచిన బ్రాహ్మణ వీరుడీ సిద్ధన కుమారుడు. తిక్కన సోమయాజి తాతకూడ మిక్కిలి ప్రసిద్ధుడుగ కాన్పించుచున్నాడు. ఈతడు భాస్కర నామధేయుడు. ఈ భాస్కరుడు గుంటూరునందు పరిపాలనము

చేసిన ఉదయరాజునకు మంత్రిగ నుండినట్లు నిదర్శనములు కలవు. సుప్రసిద్ధుడైన తిక్కన సోమయాజి తన తాత గొప్ప కవీశ్వరుడని పొగడియున్నాడు. ఈ భాస్కరమంత్రి రామాయణమను గ్రంథము రచించినట్లును, అయ్యది కారణాంతరములచే జీర్ణస్థితికి వచ్చినప్పుడు హుళక్కి భాస్కరుడు మున్నగు కవులు దానిలోని కొన్ని భాగములను తిరుగ వ్రాసిరనియు, ఇదియే భాస్కర రామాయణమనియు ఒక వాదము కలదు.

పైన వర్ణింపబడిన తిక్కనభూపతి కుమారుడు మనుమ భూపతి. మనుమ భూపతికి మనుమసిద్ధి యను నామాంతరము కలదు. ఈతడు కూడ తండ్రివలెనే గొప్ప శూరుడు కాని యాతనివలె నదృష్టశాలి కాడు. సిద్ధేశ్వర చరిత్రమను శైవ గ్రంథమునందు మనుమసిద్ధి రాజును గూర్చి యొక ముఖ్యమగు చారిత్రికాంశము గలదు. అక్కన బయ్యనలను వారు మనుమసిద్ధి రాజునకు దాయాదులనియు, వారీ రాజును పదభ్రష్టునిజేసి రాజ్యమునుండి పారద్రోలిరనియు, అప్పుడీ రాజుయొక్క మంత్రియైన తిక్కనామాత్యుడు కాకతీయ ప్రభువైన గణపతిదేవ చక్రవర్తి కడకుపోయి యాతనికి తాను రచించిన భారత గ్రంథమును వినిపించి యాతని గౌరవమునకు పాత్రుడయ్యెననియు, తిక్కన ప్రార్థనపై గణపతిదేవుడు మనుమసిద్ధికి సహాయము గావించి యాతనిని మరల నెల్లూరు రాజ్యమునకు ప్రభువును కావించెననియు, ఈగ్రంథమున వర్ణింపబడియున్నది. కొందరు చరిత్రకారు లీ కథ సత్యదూరమని యభిప్రాయ పడు

చున్నారు. కాని ఆధునికులు కొందరీ విషయము నిజమే యనియు, తాను కావించిన సహాయమునకు ప్రతిఫలముగ గణపతిదేవుడు మనుమసిద్ధి రాజ్యములో కొంత భాగమును గైకొని యాతనిని సామంతునిగ చేసికొనెనని తలంచుచున్నారు.

## తిక్కన వంశము — కవిత.

మనుమసిద్ధికాలములో జరిగిన మరియొక సంఘటన యాంధ్రదేశీయుల కందరకును తెలిసియున్నది. మనుమసిద్ధికిని కాటమరాజను యాదవవంశప్రభువునకును పోరాటము సంభవించినప్పుడు, మనుమసిద్ధి సేనానాయకుడైన ఖడ్గతిక్కన ప్రథమ యుద్ధమందు శత్రుసేనాసముద్రమును తరింపలేక యింటికి పారివచ్చెననియు, యింటిలో భార్యయు, తల్లియును ఆతని భీరుత్వమును తీవ్రముగ నపహసించినందున ఖడ్గతిక్కన యభిమానపడి మరల యుద్ధభూమికిపోయి శత్రువులతో పోరి రణనిహతుడయ్యెననియు ప్రసిద్ధమైనకథకలదు. ఈ కథ యానాటిబ్రాహ్మణుల సామర్థ్యమును, ప్రజాసామాన్యమందుగల వీరజనోచితభావములను తెల్లముగావించుచున్నవి. కవిబ్రహ్మయైన తిక్కనసోమయాజి ఖడ్గతిక్కనకు పినతండ్రికుమారుడు. సోమయాజి తండ్రికొమ్మన. ఈ కొమ్మనామాత్యుడు గొప్ప రణయోధుడని నిర్వచనోత్తరరామాయణమువలనను, కేతన కవికృతమగు దశకుమారచరిత్రమువలనను తెలియుచున్నది. తిక్కనసోమయాజి మనుమసిద్ధిరాజునకు మంత్రిగను, ఆస్థాన

కవిగను ఉండెను. మనుమసిద్ధి తిక్కనయందు మిక్కిలిగౌరవము కలవాడై యాతనిని మామయని పిలుచుచుండెడివాడు. తిక్కన తాను రచించిన నిర్వచనోత్తరరామాయణమును మనుమసిద్ధి కంకితముచేసెను. మరికొంతకాలముగడచినతరువాత తిక్కనామాత్యుడు రాజకీయవ్యవహారములనుండి తప్పుకొని, సోమపానముచేసి సోమయాజియై, యామీదట భారతమహాకావ్యమును విరచించెను. అప్పటికి మనుమసిద్ధిరాజు గతించుటయు, తిక్కన యైహికవిషయపరాఙ్ముఖుడును, భగవద్ధ్యానతత్పరుడునైయున్నందున నీగ్రంథము హరిహరనాథున కంకితము కావింపబడియుండునని చరిత్రకారు లూహించుచున్నారు. తిక్కనసోమయాజియొక్క కవిత్వప్రశస్త్యమునుగూర్చి వేరుగ చెప్పవలసిన యావశ్యకతలేదు. కవిబ్రహ్మయని యీతని కొసంగబడిన బిరుదమునందే యీతని కవితామహత్వ మిమిడియున్నది. తిక్కనరచించిన యాంధ్రభారతము ప్రపంచమందలి యుత్తమోత్తమగ్రంథములతో బోల్చదగియున్నదని పండితులు తలంచుచున్నారు. తిక్కనసోమయాజి తనసమకాలీనులచే కూడ విశేషముగ గౌరవింపబడుచుండెను. కేతనయనెడికవి తిక్కనయందు తనకుగల భక్తిప్రపత్తులను చూపుటకై దశకుమారచరిత్రమనుగ్రంథము నాతని కంకితముచేసెను. తిక్కన సోమయాజి యితరగ్రంథములుకూడ రచించెనని తెలియుచున్నది. కాని వానికి విశేషవ్యాప్తి లేదు.

## ఇ త ర క వు లు

ఈ కాలమునందు అధర్వణాచార్యుడను మరియొకకవి ప్రసిద్ధిచెందెను. ఆతడు త్రిలింగశబ్దానుశాసనము, వ్యాకరణ కారికావళి, అధర్వణచ్ఛందము, భారతములోని కొన్నిపర్వ ములను వ్రాసినట్లు తెలియుచున్నది. ఈతడు విద్వాంసుడు మాత్రమేకాక చక్కనికవిత్వముకూడ చెప్పెడివాడని వ్రాసిన భారతగ్రంథమువలన దెల్లమగుచున్నది. తిక్కనసోమయాజికి సమకాలీనులై, యాతనిచే కవిత్వవిషయములను మెప్పుపొందిన కవులు కేతన, బయ్యనలనువారు మనుమసిద్ధిరాజుకాలమున నుండిరి. అందు కేతనదశకుమారచరిత్రమను గ్రంథమునువ్రాసి తిక్కనసోమయాజి కంకితముచేసెను. బయ్యనయనునాతడు తిక్కనసోమయాజిచే "భవ్యభారతి" యని పొగడ్తగన్నట్లు గ్రంథములు నిదర్శనమిచ్చుచున్నవి. కాని యీ బయ్యన వ్రాసినగ్రంథములేమియు ప్రస్తుతము కానరావు. మార్కం డేయపురాణమునువ్రాసిన మారనకవి తాను తిక్కనసోమ యాజి శిష్యుడనని తెల్పుకొనియున్నాడు. మనుమసిద్ధిరాజు మరణానంతర మాతనివంశీయుల ప్రాబల్యము పూర్తిగక్షీణించి వారు కాకతీయులకు సామంతమాత్రులుగ నున్నట్లు కన్పట్టు చున్నది. ఈ వంశములోని తుదిప్రభువు రాజగండ గోపాలుడను నాతడు కాకతీయచక్రవర్తియగు ప్రతాపరుద్రునిచే జయింప బడినట్లును, అంతటితో నీ విక్రమసింహపురిచోడుల పరిపాలన మంతమొందినట్లును కానవచ్చుచున్నది.

## ప్రొద్దుటూరు రాజులు

పురాతన పల్లవరాజవంశస్థులైన కొందరురాజులు ప్రస్తుతపు కడపమండలములోని ప్రొద్దుటూరును రాజధానిగ జేసికొని కొంత యాంధ్రభూభాగమును పాలించిరి. క్రీ. పూ. 1102 సం॥రమున నందివర్మయను నీ వంశపురాజు రాజ్యమునకువచ్చెను. ఈతడు బ్రాహ్మణుల కనేకాగ్రహారములు దానముచేయుట, దేవాలయప్రతిష్ఠలు కావించుటయేగాక చెరువులను పంటకాల్వలను త్రవ్వించి ప్రజోపయోగమునకై యెంతయో పాటుపడినట్లు తెలియుచున్నది. ఈ వంశమునందు మరికొందరురాజులు పాలనమొనర్చినతర్వాత వీరిరాజ్యము కాకతీయప్రభువులచే జయింపబడినట్లు చరిత్రలు నిరూపించుచున్నవి.

## ఆంధ్రదేశస్థితి

తెలుగు చోడరాజులకాలమునందు దేశము మొత్తముమీద సుభిక్షముగనున్నట్లు తెలుపవచ్చును. ఈ యుగమునందు ఆంధ్రదేశమున అనేకరాజవంశములు పాలనముచేసెను. ఈ రాజులు తరచుగ నొండొరులతో యుద్ధములు సాగించుచుండిరి. కాని ఆ యుద్ధములు ప్రజాసామాన్యమున కెట్టి యనర్థములను కల్గింపలేదు. ప్రజలు తమ పంచాయితీలద్వారా స్వపరిపాలనము కావించుకొనుచు సుఖజీవితము గడపుచుండిరి. ప్రభువులుకూడ ప్రజాహిత తత్పరులై రాజ్యపాలనముచేసినట్లు

నిదర్శనములు కాన్పించుచున్నవి. చోడరాజులలో పలువురు వైష్ణవమతావలంబులైయున్నను వారు శైవమతము మున్నగు నితరమతములను బాధింపలేదు. ఈ కాలమునం దాంధ్రభాషాభివృద్ధి బాగుగాజరిగినట్లు మన మీావరకే తెలిసికొనియున్నాము. ఈ యుగమునం దాంధ్రదేశస్థులు విదేశీయులతో ఓడవ్యాపారము చేయుచుండినట్లును, విదేశవర్తకు లిచ్చటికి తరచుగ వచ్చుచు పోవుచు నుండినట్లును తెలియవచ్చుచున్నది. కృష్ణాపట్టణమను రేవుపట్టణ మాకాలమున మిక్కిలి ప్రసిద్ధి వహించియుండెను.



# ఆంధ్రుల చరిత్ర

## కాకతీయులు

క్రీ. వె. పదునొకండవ శతాబ్ది యారంభము నుండి మూడు శతాబ్దుల కాలము కాకతీయరాజు లఖండ వైభవముతో నాంధ్రదేశమున రాజ్యము కావించిరి. వీరు కేవల స్థానిక ప్రభువులుగ నుండక విస్తృతమగు రాజ్యముపై పరిపాలనము చేయుటచే చక్రవర్తి పదమునకు తగియున్నారు. ఆంధ్రదేశము వీరి కాలమున మహత్తరముగ దీప్తి చెందెను. ఆ కాలమున నాంధ్ర భాషాభివృద్ధియు, శిల్ప కళాభివృద్ధియు బాగుగా జరిగెను. ఈ కారణమున కాకతీయయుగ మాంధ్ర దేశ చరిత్రయందు ప్రాముఖ్యతను వహించు చున్నది.

### పూర్వదశ

కాకతీయులు ప్రస్తుతము హైదరాబాదు రాష్ట్రము నందున్న వరంగల్ అనబడు ఓరుగలుపురమును రాజధానిగ చేసికొని రాజ్య మేలిరి. ప్రథమ దశయందీ రాజులు ఓరుగల్లునకు సమీపమున నున్న అనుమకొండ యను ప్రదేశమును కేంద్రముగ చేసికొనియుండిరి. ఈ రాజులు చతుర్థకులజులని

తెలియవచ్చుచున్నది. ఈ రాజులు మొట్టమొదట కాకతీ యను శక్తి దేవతను కులదేవతగ నంగీకరించి పూజించుచున్నం దున వీరికి కాకతీయులను నామము కలిగిన ట్లూహింపబడు చున్నది. కాకతీయులు మొట్టమొదట పూర్వ చాళుక్యులకును తరువాత పశ్చిమ చాళుక్యులకును సేనానులుగను సామంతులు గను ఉండి ఈ రాజవంశములు క్షీణదశకు వచ్చినప్పుడు స్వాతంత్ర్యమును ప్రకటించిరి. కాకతీయ రాజులలో మొదటి ప్రోలరాజు ప్రథముడు. ఈతడు 1050 ప్రాంతమున కాకతీయ సామ్రాజ్యమునకు పునాది వేసి 30 సంవత్సరముల కాలము రాజ్యము చేసెను. త్రిభువన మల్లబేతరాజు (1080–1115) రెండవ ప్రభువు. ఈతడు మొదటి ప్రోలరాజుకంటె కొంచెము ముందంజ వేసి మహా మండలేశ్వరు డను బిరుదు వహించెను. కాని నామ మాత్రమునకు పశ్చిమ చాళుక్యులకు సామంతు డుగ నుండెను. ఈతని కుమారుడు రెండవ ప్రోలరాజు (1115–1158) కాలములో కాకతీయులు పూర్తిగ స్వతంత్రు లైరి. ఈ రాజు ఓరుగల్లు పట్టణమును ప్రతిష్ఠ జేసినట్లు తెలియు చున్నది. ఈతని కాలములోనే అనుమకొండ యందలి పద్మాక్షి దేవాలయము నిర్మింపబడెను. ఈ రాజు తన కుమారుడగు రుద్రరాజుచే చంపబడినట్లు గాధలు కలవు. కాని యివి విశ్వాస నీయములు కావు.

## కాకతీయులు బలపడుట

రెండవ ప్రోలరాజు తరువాత నాతని కుమారుడు రుద్రదేవుడు సింహాసన మధిష్ఠించెను. (1158-1195) ఈతడు మహా పరాక్రమవంతుడు. కాకతీయ రాజ్య మీతని కాలములో విస్తరింపబడి బలపడెను. ప్రథమమున రుద్రదేవుడు కొందరు సామంత ప్రభువులను జయించి వారి రాజ్యములను తన యేలుబడిలోనికి గైకొనెను. తన ప్రత్యర్థులలో నొకడైన చోడోదయు డను నొక ప్రభువు కుమార్తెను పద్మావతి యను నామెను రుద్రదేవుడు వివాహ మాడెను. ఆపైన రుద్రదేవుడు వెలనాటి చోడులతో యుద్ధము కావించి వారి రాజ్యమును జయించెను. రెడ్డి వంశజులును పద్మనాయక వంశస్థులునగు వీరులు పలువురు రుద్రదేవునికి సేనానులుగ నుండి యాతని కెంతయో సహాయమును జేసినట్లు నిదర్శనములు కలవు.

రుద్రదేవుని కాలములో వీరశైవ, వైష్ణవమతముల కెక్కువ ప్రాబల్యము కల్గెను. శైవమతము కర్ణాటక దేశమందు వలెనే తెలుగు దేశములోకూడ వ్యాపించెను. ఈ కాలమున సుప్రసిద్ధ శైవాచార్యుడగు గురుమల్లికార్జున పండితారాధ్యుడును, బసవపురాణమును రచించిన పాల్కురికి సోమనాథుడను కూడ జీవించిరి. ఆంధ్రదేశమునందు శైవమత వ్యాప్తికి పాటుపడిన వారిలో పండిత త్రియ మనబడు శివలెంక మంచన పండితుడు, శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితారాధ్యుడును

ముఖ్యులు. బసవేశ్వరుడు ప్రచారముచేసిన వీర శైవమతమందు వర్ణాశ్రమ ధర్మములు నిరసింపబడినవి. పండితారాధ్యుడును శుద్ధశైవుడై భక్తిమతమును ప్రచారము చేసినను, వర్ణాశ్రమ ధర్మములను నిరసింపలేదు. పండిత త్రయము వారు ప్రచారము చేసిన శైవమతము ద్వైతసంప్రదాయము ననుసరించెను. శైవమత గ్రంథము లీ యుగమునందు విశేషముగ రచింపబడెను. ఆంధ్రదేశ చరిత్రములో విఖ్యాతిచెందిన పల్నాటి యుద్ధ మీకాలమందే జరిగెను. రుద్రదేవుడు యుద్ధమందు పాల్గొనిన యొక పక్షమువారికి సైన్య సహాయముకూడ చేసెనని తెలియుచున్నది. రుద్రదేవుని కాలమునందు ఓరుగల్లు పట్టణము కాకతీయులకు రాజధాని యయ్యెను. ఈ కాలములో ఆంధ్రశిల్ప మత్యున్నత స్థితికి వచ్చెను. హనుమకొండ యందలి సహస్రస్థంభ మంటప మీ కాలమునసే నిర్మింపబడెను. కాకతీయుల యౌన్నత్యమును జూచి సహింపలేక దేవగిరి యాదవరాజు లీ రాజ్యముపై దండెత్తిరి. రుద్రదేవుడు దేశ రక్షణమునకై పోరాడుచు ప్రాణముల బాసెను.

## కాకతీయుల విజృంభనము.

రుద్రదేవుని మరణానంతర మాతని తమ్ముని కుమారుడగు గణపతి దేవుడు రాజయ్యెను. (1198–1261) రుద్రదేవుని మరణానంతరము పది సంవత్సరముల వరకు నీతడు దేవగిరి రాజులగు యాదవుల కడ బందీగనుండి తరువాత విడువబడెను.

ఆ పైన నాత డేబది సంవత్సరములు పైబడి రాజ్యముచేసి కాకతీయ రాజ్యవైభవమును సహస్ర విధముల పెంపొందించెను. తాను యాదవులకడ బందీగ నున్న కాలములో సామంతు లనేకులు విజృంభించి స్వతంత్రులగుట వలన గణపతి దేవుడు వీరినందరను ఓడించెను. అటుపిమ్మట గణపతి దేవుడు వెలనాటి ప్రభువులను తనకు వశంవదుల గావించి కొనెను. వీరిలో కొందరితో గణపతి దేవుడు వివాహ బాంధవ్యముల నెరపి తన రాజనీతి కౌశల్యమును ప్రకటించెను. అనంతర మీ రాజు కళింగ దేశమును జయించెను. అటు తరువాత తెలుగు చోడులను, ప్రస్తుత దత్తమండలము నందలి రాజులను తనకు సామంతులుగ కావించుకొనెను. గణపతి దేవుడు కాంచీపుర పాలకులగు పాండ్యులతో కూడ పోరి విజయ లాభమును పొందెను. కాని అయ్యది తాత్కాలిక విజయముగ మాత్రము పరిణమించెను. రుద్రదేవుని కాలమునందు వలెనే రెడ్డి పద్మనాయక వీరు లనేకులు గణపతి దేవునకు నమ్మినబంటులై సహాయపడిరి. గణపతి దేవుని కాలమునందు దేశము సుభిక్షముగ నుండెను. ఇచ్చటి వర్తకులు విదేశ వర్తకులతో ఓడలపై వ్యాపారములు సల్పుచుండినట్లును, రాజులు వర్తకపు దినుసులపై సుంకము విధించుచుండినట్లును తెలుపు ఆధారములు కలవు. ఈ కాలములో శైవమత ప్రచారము విశేషముగ నుండెను. కాకతీయ ప్రభువు లీ మతమునకు పోషకులుగ నున్నట్లు తెలియనగుచున్నది. గణపతిరాజు ప్రభుత్వకాలములో

శిల్పకళాభివృద్ధి మెండుగ జరిగెను. ప్రస్తుతము వరంగల్ జిల్లా యందలి పాలంపేట యను ప్రదేశము నందలి అద్భుత శిల్ప కళాశోభితమగు శైవ శివాలయ మీ కాలము నాటిదే. గణపతి చక్రవర్తి తన రాజధానియగు నేకశిలా నగరమును కూడ సంస్కరించి బలపరచినట్లు మనకు నిదర్శనములు కాన్పించు చున్నవి.

గణపతిదేవుని యనంతరమాతనికుమార్తె రుద్రాంబ సింహాసన మధిష్ఠించెను. (1258-1296) ఈమె గణపతిదేవుని కాలమునందే రాజ్యాంగశిక్షణముపొంది, పురుషునివలె దుస్తులను ధరించుచు తనతండ్రితో కొల్వుకూటమునకు వచ్చుచుండెడిదట. గణపతిరాజునకు పురుషసంతానము లేనందువలన నాతడీమార్గము నవలంబించెను. రుద్రమదేవి కిరువురుకుమార్తెలుండిరి. అందు మొదటియామెయగు ముమ్మడమ్మ కుమారుడగు ప్రతాపరుద్రుని రుద్రాంబ తనతండ్రికాలమునందే దత్తత కావించుకొనెను. ఈమె స్త్రీయయ్యు ధైర్యస్థైర్యములుకలది. తనపై యెదురుతిరిగిన సామంతరాజుల నీమె సంపూర్ణముగ నిర్జించుటయేకాక మత్సరగ్రస్తులై తనరాజ్యముపై దండువెడలిన దేవగిరియాదవరాజుల నెదుర్కొని తరిమివైచెను. ఈమె రాజ్యకాలమునందు దేశము సుభిక్షముగ నుండెను. రుద్రాంబ ప్రజోపయోగకరములగు ననేక సత్కార్యములు కావించెను. ఈమె ఓరుగల్లుకోటను బలపత్తరముగ నొనర్చెను.

## కా క తీ యు ల ప త న ము

రుద్రాంబ యనంతర మామె మనుమడు ప్రతాప రుద్రుడు కాకతీయసింహాసన మధిష్ఠించెను. (1290_1326) ఈతనితండ్రిపేరు మహాదేవరాజని తెలియుచున్నది. ప్రతాప రుద్రునికాలమునందే మహమ్మదీయులు దక్షిణదేశముపై దండ యాత్రలు ప్రారంభించిరి. ఢిల్లీప్రభువైన అల్లాయుద్దీనుచక్రవర్తి 1303 సంవత్సరమున తనసేనానాయకుడగు మాలిక్ కాఫరును ఓరుగంటిని జయించుటకై పంపెను. కాని ప్రతాపరుద్రుని సేనానాయకులు మిక్కిలి సాహసపరాక్రమములజూపి తురుష్కులనోడించి వెనుకకు పారద్రోలిరి. మరుసటిసంవత్సరమున తురుష్కు లోరుగంటిపై యింకొకపర్యాయము దండెత్తిరి. కాని యీ పర్యాయముకూడ విజయలక్ష్మి ఆంధ్రులనే వరించెను. 1309 వ సంవత్సరమున మాలిక్ కాఫర్ ఓరుగల్లుపై మూడవసారి దండయాత్రసాగించెను. ఈ పర్యాయమాంధ్రులు మిక్కిలి ధైర్యసాహసములతో పోరిరి. కాని తురుష్కుల బలము నకు తాము చాలమని తెలిసికొని, ప్రతాపరుద్రుడు వారికి కొంతధనము నొసంగి సంధి చేసికొనెను. ఆంధ్రు లుపయోగించిన యుద్ధసాధనములు లోపభూయిష్ఠము లగుటవలన వారి కీపరాజయము సంభవించెను. ఒకవంక తురుష్కులతో హోరాహోరని పోరాడుచున్న ప్రతాపరుద్రునిపై యాతని సామంతులు పలువురు తిరుగబడిరి. కాని యాతడు వీరినందరను తగు విధముగ శిక్షించెను. 13_10_1321 సంవత్సరము

లలో ఢిల్లీచక్రవర్తి యువరాజగు మహమ్మద్‌బిన్ తుఘలక్ అను నాతని నోరుగంటిపై తనసైన్యములతో పంపెను. ప్రథమ దండయాత్రయం దాంధ్రులకు విజయము లభించెను. కాని రెండవపర్యాయ మాంధ్రులు సంపూర్ణముగ నోడిపోయిరి. ఇందులకు మహమ్మదీయులయుద్ధకౌశల్యమునకు ఆంధ్రులయందలి అంతఃకలహములును ప్రతాపరుద్రుని రెడ్డిసామంతుల స్వామిద్రోహమును తోడయ్యెను. ప్రతాపరుద్రుడు పద్మనాయక కులస్థులయెడ తమకంటె యెక్కు డభిమానము చూపెనను కారణమున రెడ్డివీరులు ముసల్మానులతో కుట్రలు చేసి తమ స్వామి పరాజయమునకును ఆంధ్రసామ్రాజ్య వినాశమునకును కారకులైనట్లు చరిత్రలవలన దెలియుచున్నది. ప్రతాపరుద్రుని తురుష్కులు ఢిల్లీకి బందీగ గొనిపోయిరి. కొంతకాలమున కాతడు విముక్తుడైనట్లు మన కాధారములు దొరకుచున్నవి కాని కాకతీయసామ్రాజ్యవైభవముమాత్ర మాతడు పునరుద్ధరింపజాల డయ్యెను.

## కా క తీ యు ల వి భ వ ము

ప్రతాపరుద్రదేవుడు స్వయముగ విద్వాంసుడగుటయే కాక విద్వాంసులను పెక్కండ్రను పోషించెను. ఈతనికాలమునందు సంగీతము, జ్యోతిషము, నాట్యము, సాహిత్యమును మిక్కిలి యభివృద్ధి గాంచినట్లు తెలియుచున్నది. ప్రతాపరుద్రుని యాస్థానమందున్న కవులలో ప్రతాపరుద్ర యశో

భూషణమను నలంకారగ్రంథమ్మును రచించిన విద్యానాథకవి ప్రత్యేకముగ పేర్కొనదగినవాడు. ఈతడుకాక గంగాధరకవి, నరసింహాకవి, విశ్వనాథుడు మున్నగువారు పలువురు ప్రతాప రుద్రచక్రవర్తి యాస్థానము నలంకరించిరి. కాకతీయసామ్రాజ్యముయొక్క వైభవమునకును విఖ్యాతికిని, ఆప్రభువులను సేవించిన సేనానులు, మంత్రిశ్రేష్ఠులు మున్నగువారే మూలము. వీరిలో నాగయగన్నమంత్రి ఇందులూరి అన్నయ, ఇందులూరి రుద్రయ, బెండపూడి అన్నయ్య మున్నగువారు ప్రత్యేకముగ ప్రశంసింపదగినవారు. రెడ్లును పద్మనాయకులును కాకతీయప్రభువులకడ నున్నతోద్యోగములయం దుండుచు వచ్చిరి.

## ఆంధ్రదేశస్థితి.

కాకతీయుల కాలమునందు దేశము సస్యసమృద్ధము గను శాంతియుతముగను ఉండెను. రాజులు ప్రజల క్షేమము నకై నిరంతరము పాటుపడుచు చెరువులను, బావులను త్రవ్వించియు, అడవులను కొట్టించివైచి నూతన గ్రామములను స్థాపించియు తోడ్పడుచుండిరి. ప్రజలు తమ తమ గ్రామము లందు స్వపరిపాలనము కావించుకొనుచు, సుఖముగ నివసించు చుండిరి. రాజు లన్యోన్యము పోరాడుచున్నను వీరి సుఖజీవన మున కెట్టి యాటంకమును కలిగెడిది కాదు. కాకతీయ రాజులు తమ సామ్రాజ్యమును పరగణాలుగ విభజించి వానిపై

యొక్కొక ఉన్నతోద్యోగిని పరిపాలనమునకై నియమించెడి వారు. ఈ యుద్యోగులు చాల విషయములలో స్వతంత్రులుగ నున్నను, రాజులు వీరి పరిపాలనమును గూర్చి చారుల మూల మున దెలిసికొనుచు అందలి లోపములను సవరించు చుండిరి. కేంద్రప్రభుత్వము రాజు నధికారమందుండెడిది. రాజునకు సలహా యొసంగుటకై వివిధ మంత్రులుండిరి. ప్రభువులు నిరంకుశాధికారము గల్గియుండియు ప్రజాభిప్రాయమునకు వెఱచుచు, ధర్మశాస్త్రను గుణ్యముగ రాజ్యపాలనము చేయు చుండిరి.

## ఓ రు గ ల్లు.

కాకతీయ ప్రభువులకు రాజధానిగా నుండిన ఏకశిలా నగరము మహోన్నత దశయందుండి లక్ష్మీనివాస స్థలమో యనునట్లుండెడిది. ఓరుగల్లు పురమానాడనుభవించిన యైశ్వర్యము క్రీడాభిరామ మను గ్రంథమున విపులముగ వర్ణింపబడి యున్నది.



# ఆంధ్రుల చరిత్ర

## వెలమ, రెడ్డి యుగములు

### కాకతీయుల పతనము తరువాత ఆంధ్రదేశము.

కాకతీయ సామ్రాజ్యము క్షీణించిన తరువాత నాంధ్ర దేశమున కేంద్ర ప్రభుత్వము వంటిది మరేదియును కొంత కాలము వరకును స్థాపితము కాలేదు. విజయనగర రాజ్యము తలయెత్తిన తరువాత నీ కొరత తీరినదని చెప్పవచ్చును. కాని కొంతకాలము వరకును తెనుగుదేశము స్థానిక ప్రభువుల యధీనమున నుండెను. ఈ ప్రభువులు అనగా రెడ్లును, పద్మ నాయక వంశస్థులును కాకతీయ రాజుల కాలమందు వారికడ సామంతులుగను, సేనా నాయకులుగను వ్యవహరించి, చిర కాలము వరకును కాకతీయ సామ్రాజ్యమునకు మూల స్తంభ ములై యొప్పిరి. ఈ వీరులు తమ కేలికలగు కాకతీయులు రాజ్యమును కోల్పోయిన పిమ్మట స్వతంత్రులై వివిధ ప్రాంత ములలో రాజ్యము చేయజొచ్చిరి. వీరిలో కొండవీడు, వినుకొండ రాజ్యములను పాలించిన రెడ్డి ప్రభువులును, రాచ

కొండ, దేవరకొండ ప్రాంతములను పాలించిన రేచెర్ల వంశీయు లగు వెలమ వీరులును సుప్రసిద్ధులు.

ఓరుగల్లును తురుష్కు లాక్రమించుకొనిన మరికొంత కాలమునకు ఆంధ్రప్రభువు లేకమై కర్ణాట కేరళ రాజుల యొక్క సహాయముతో నా కోటను మరల ముట్టడించిరి. మహమ్మదీయులు సాహసముతో పోరిరికాని తుట్టతుదకు హైంద వుల యొత్తిడి తాగలేక ఓరుగల్లును వీడి యుత్తరము నందలి దేవగిరి దుర్గమునకు పారిపోయిరి. ఆ వెనుక ప్రతాపరుద్రుని కుమారుడు కాకతీయ సింహాసనమును పునః అధిష్ఠించెనని కొం దరు చరిత్రకారుల యభిప్రాయమై యున్నది. కాని ప్రతాప రుద్రుని కుమారు డొకడుండెనను యంశమునే మరికొంద రంగీ కరించుట లేదు. ఏది యెట్లున్నను కాకతీయ సామ్రాజ్య వైభ వము మరల తలయెత్తలేదనుట నిర్వివాదాంశము.

## పద్మ నా య కు లు.

రాచకొండ, దేవరకొండ రాజ్యములకు పాలకులైన రేచెర్ల వంశీయులలో సింగమనాయడు ప్రధముడు. ఈతడు మిక్కిలి పరాక్రమవంతుడు. ఈ ప్రభువునకును, రెడ్డి వీరు లకును రాచ వారికిని ప్రబల వైరముండెను. రాచవారు సింగమ నాయని మాయోపాయముచే చంపినందు వలన, ఆతని కుమా రులగు అనపోతనాయడును, మాధవనాయడును క్షత్రియ కుల మును పరశురాముడు పూర్వము రాజుల నందరను సంహ

రించిన విధముగ, చాల నష్టపరచిరనియు, పలువురు రాచవారీ కారణము వలన రాచకొండ రాజ్యమును విడచి పారిపోయి రనియు మనకు చరిత్రల వలన దెలియుచున్నది. సింగమనాయుని జ్యేష్ఠపుత్రుడగు అనపోతనాయడు క్రీ. పూ. 1344–1380 వరకు రాజ్యము చేసినట్లు కానవగుచున్నది. ఈతడు ఓరుగల్లు, పానగల్లు, భువనగిరి, మెతుకు, గోలకొండ మున్నగు దుర్గములను స్వాధీనము చేసికొని, ఆంధ్రదేశాధీశ్వరుడను బిరుదు వహించి మిక్కిలి వైభవముతో రాజ్యము చేసెను. ఈ కాలముననే దక్షిణాపథమున మహమ్మదీయులు బహమనీ రాజ్యమును స్థాపించిరి (1347). బహమనీ రాజులకును రేచెర్ల వారికిని ప్రథమమున యుద్ధములు జరిగెను. కాని తరువాత గోలకొండ దుర్గమును తమ రాజ్యములకు సరిహద్దుగ జేసికొని వీరు సంధి కావించుకొనిరి. అనపోతనాయని ప్రభుత్వమునకు కేంద్రస్థానమైన రాచకొండ దుర్గము చాల బలవత్తరమగు కోటయనియు, శత్రుదుర్భేద్యముగ నుండెననియు తెలియుచున్నది. ఈ రాజు శైవమతావలంబకుడై తన రాజ్యమున ననేక ప్రదేశముల భైరవ ప్రతిష్ఠలు విశేషముగ చేసెను. ఈ రాజు ప్రజాక్షేమము నకై యెంతయో పాటుపడెడి వాడని తెలియుచున్నది. అనపోతనాయని యనంతర మాతని కుమారుడు సింగమనాయడును, ఆతని యనంతర మాతని కుమారులును రాజ్యపాలనము చేసిరి. (1380–1430) అనపోతనాయని కుమారుడగు సింగమనాయనిని సర్వజ్ఞ భూపాలుడని కొందరు తలంచుచున్నారు.

కాని సర్వజ్ఞ సింగ భూపాలుడీతడు కాడని చరిత్రకారులు తలంచుచున్నారు. ఈ కాలమునందు రాచకొండ ప్రభువు లకును, విజయనగర బహమనీ రాజ్యములకును యుద్ధములు సంభవించెను. కాని వీనియందు రాచకొండ ప్రభువులే జయ మును గాంచిరి. హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథోపాఖ్యాన మును ద్విపద కావ్యములుగ రచించి యాంధ్రభాషకు మిక్కిలి సేవగావించిన గౌరనకవి యీ కాలములోని వాడే యని తెలియుచున్నది. ఈ కవీంద్రుని పెదతండ్రి పోతరాజను నాతడు రేచెర్ల వణీయులకడ మంత్రిగ నున్నట్లు గౌరనయే తెల్పినాడు. గౌరన కవిత్వము మృదుమధురముగను, రసవంత ముగను ఉండునని పండితుల యభిప్రాయము.

## ప ద్మ నా య కు లు.

పైన వర్ణింపబడిన రేచెర్ల వంశీయులుకాక మెతుకు సీమకు పరిపాలకులుగ నున్న పద్మనాయక వంశీయులు మరి కొందరు చరిత్రలయందు కాననగుచున్నారు. ఈ రాజులుకూడ మిక్కిలి పరాక్రమవంతు లైనట్లును, వీరు రెడ్డి రాజులతో తరచు యుద్ధములు చేయుచు వారికెంతయో భయోత్పాతము కలుగచేయు చుండెడి వారనియు తెలుపు చాటు పద్యములు కొన్ని గలవు. రసార్ణవ సుధాకరమను గ్రంథమును రచించి సర్వజ్ఞుడను బిరుదమును వహించిన సింగభూపాలు డీ వంశము లోనివాడై యుండునని యొక వాదము కలదు.

## బమ్మెర పోతరాజు — ఇతరకవులు

భక్తాగ్రేసరుడును, ఆంధ్రభాగవత రచయితయునైన బమ్మెర పోతనామాత్యుడు ఈ సర్వజ్ఞ సింగభూపాలుని సమకాలీనుడని తెలియుచున్నది. పోతనామాత్యు డోరుగల్లు సమీపమునసున్న బమ్మెర యనుగ్రామమున నివసించుచుండెను. ఈతడు సహజపాండిత్యవిరాజితుడు. భోగినీదండకమను గ్రంథమును పోతనరచించి సర్వజ్ఞ సింగభూపాలుని కంకిత మొనర్చెనని సర్వసాధారణముగ విశ్వసింపబడుచున్నది. కాని పోతనామాత్యునివంటి భాగవతోత్తము డెన్నడును వేశ్యను పొగడుచు గ్రంథరచనము కావింపజాలడనియు, ఈ కృతిని వేరొక్కరు రచించి పోతనామాత్యుని పేరుపెట్టి యుండనచ్చుననియు నొక వాదముకలదు. పోతనామాత్యుని కీర్తి ప్రఖ్యాతు లాతని యున్న తాదర్శముల పైనను, ఆతని భాగవతగ్రంథము పైనను ఆధారపడియున్నవి. నిరంతరదారిద్ర్యముచే పీడింపబడుచున్నను తనగ్రంథమును నరాంకితముచేయక శ్రీహరికే సమర్పించిన యాదర్శప్రియు డీమహాత్ముడు. భాగవతమందలి కవితామహాత్మ్య మాంధ్రలోకమున కంతకును తెలిసిన యంశము. పోతనామాత్యుని భాగవతము పండితులును, పామరులును కూడ చదివి ఆనందించెడి గ్రంథరాజము. పైన చెప్పబడిన పద్మనాయకులకాలమునందు భైరవకవి యను నాతడు జీవించెను. ఈ కవి గరుడపురాణమునందలి శ్రీరంగమహాత్మ్యమును తెనిగించెను. ఈతడు హరిశ్చంద్రోపాఖ్యానమును రచించిన.

గౌరనమహాకవి కుమారుడు. ఈ భైరవమహాకవి కవిత్వము ప్రౌఢమై కొన్ని సందర్భములయందు శ్రీనాథుడు మొదలైన యుత్తమకవివర్యులను దలపించుచున్నట్లున్నదని పండితు లభిప్రాయపడుచున్నారు. పద్మనాయక రాజు లోరుగల్లురాజ్యమస్తమించిన వెనుక నూరేండ్లపాటు పరిపాలనముకావించిరి. పిమ్మట గజపతు లీరాజ్యమును జయించిరి. ఆపైన నీ రాజ్యము మహామ్మదీయు రాజుల వశమయ్యెను.

## కొరుకొండ రెడ్లు

కాకతీయసేనానులలో రెడ్లుకూడ మిక్కిలి ప్రశస్తిగని యుండిరి. కాకతీయరాజ్యము క్షీణించిన వెనుక వీరు రెండు రాజ్యములను స్థాపించి కొంతకాలమువరకును వైభవముతో పాలించిరి. ఇందు కొరుకొండను రాజధానిగ చేసికొని పాలించినవారొకరు. (1335–1380) ఈరెడ్లు రాజమహేంద్రవరమును తురుష్కులనుండి జయించి దానికి సమీపముననున్న కొరుకొండయనుచోట దుర్గమును నిర్మించిరి. ఈదుర్గమును నిర్మించినయాతడు మంచికొండ కూనారెడ్డియనునాతడు. ఈతని కుమారుడు ముమ్మడినాయకుడు (1340–1370) పరాక్రమవంతుడును, విద్యాపోషకుడునని పేరుగాంచెను. ఈప్రభువు ప్రస్తుతము గోదావరిజిల్లాప్రాంతమునంతను పాలించెను. ఈ ముమ్మడినాయకుని తమ్ములు కొరాము, తాటిపాక యను ప్రాంతములందు రాజప్రతినిధులుగనుండి పరిపాలనము చేసిరి.

ఈరాజులు వైష్ణవమతము నవలంబించి, వైష్ణవదేవాలయముల నెక్కింటిని నిర్మాణముచేసిరి. నేటికాలమునందువలెనే అప్పుడును, ఈ ప్రాంతము సస్యసమృద్ధమై, కొబ్బరి, మామిడి, పనస, పోక మున్నగుతోటలతో రమ్యముగ నుండెడిదట. ముమ్మడినాయకుని కుమారులు కొంతకాలము స్వతంత్రులుగ రాజ్యముచేసిన వెనుక నీరాజ్యము కొండవీటి పాలకుడైన కుమారగిరిరెడ్డి మంత్రియును, సేనానియునైన కాటయ వేమారెడ్డిచే జయింపబడి యాతని పాలనమునకు లోబడెను.

## కొండవీటిరెడ్లు

కొండవీడును ముఖ్యస్థానముగ చేసికొని మరికొందరు రెడ్డిరాజులు రాజ్యముచేసిరి. రెడ్డిరాజన్యులలో నీవంశీయులే ముఖ్యులు. వీరు నూరేండ్లకాలము రాజ్యపాలనముచేసి కవులను పండితులను పోషించి, స్వయముగ విద్వాంసులై ప్రశస్తిని గాంచిరి. ఈవంశమున మొదటిరాజు వేమారెడ్డియను నాతడు. ఈ వేమారెడ్డి పూర్వీకులు కాకతీయులవద్ద సైన్యాధీశులుగ నుండి విఖ్యాతిగాంచిరి. ఈ రాజులలో కొందరు తమనామముతోపాటు కోమటి యను నామమును వహించుచుండెడివారు. 'కోమటి' యొక జైనదేవతయై యుండవచ్చుననియు, ఈరెడ్డిప్రభువు లా దేవత గౌరవార్థమై తమనామములకు కోమటియనుపేరును చేర్చుచుండిరనియు, కొందరు చరిత్రకారులూహించుచున్నారు. 'కోమటి' పదము శ్రేష్ఠవాచకమనియు,

ఈ వంశపురెడ్ల పూర్వీకులు ఉన్నతస్థానికాధికారులుగ నుండుచు వచ్చినందున వీరికి కోమటి బిరుదము లభించినదనియు ఇటీవల నొక ఆంధ్రప్రముఖులు వాదించియున్నారు. వేమారెడ్డి ఆంధ్ర దేశమును తురుష్కుల యధీనమునుండి తప్పించిన వీరుడు. ఈతనికి ప్రథమమున అద్దంకి రాజధానిగ నున్నట్లు కానవచ్చు చున్నది. ఈ రాజు తన బంధువర్గమువారినే సహాయకులుగ నుంచుకొని జనరంజకముగ రాజ్యపాలనము చేసెను. ఆతడు బ్రాహ్మణభక్తికలవాడై వారల కనేకాగ్రహారముల నొసంగెను. వేమారెడ్డి కొల్వుకూటమునందు వేదాధ్యయనసంపన్నులగు బ్రాహ్మణోత్తములును, వివిధశాస్త్రవేత్తలగు విద్వాంసులును, మహనీయులగు కవిరాజులును ఉండిరి. ప్రబంధపరమేశ్వరు డని కీర్తిగాంచి, భారతగ్రంథ పూరణమువలన కవిత్రియములో చేర్పబడిన మహాకవి ఎఱ్ఱాప్రగడ వేమభూపాలుని యాస్థానము నందుండెను. ఎఱ్ఱాప్రగడ రామాయణము, హరివంశము నను గ్రంథములను రచించి వేమరాజున కంకితము చేసెను. ఆ తరువాత రచింపబడిన నరసింహపురాణమును అహోబల నరసింహస్వామి కంకిత మొనర్చెను. మహనీయుడైన ఎఱ్ఱా ప్రగడ కవిత్వమును ప్రశంసించుట యనావశ్యకము. నన్నయ తిక్కనలతో బాటు ఈ కవిశ్రేష్ఠు డాంధ్రభాషకు మహత్తరమైన సేవ యొనర్చెను. ఈతని కవితయందు మృదుత్వమును, ప్రౌఢ త్వమునుకూడ మేళవించియున్నవి.

వేమరాజు ననంతర మాతనికుమారు డనపోతారెడ్డియు (1350–1362) ఆతని వెనుక నాతనితమ్ముడగు అనవేమారెడ్డియు

(1362-1380) రాజ్యపాలనము చేసిరి. రేచెర్లవంశీయులగు పద్మనాయకరాజులు రెడ్డిరాజ్యముపై దాడివెడలగా అనపోతా రెడ్డి వారిని పరాభవించి తరిమివైచెను. ఈ కాలమునందు రెడ్లకును, పద్మనాయకులకును తరచుగ యుద్ధములు సంభవించుచుండెడివి. అనపోతారెడ్డియు, ఆతని సోదరుడునుకూడ ప్రజారంజకముగ రాజ్యముచేసి, కవులను విద్వాంసులను పోషించిరి. వీరు బ్రాహ్మణభక్తి మిక్కుటముగ కల్గి అగ్రహారముల లెక్కింటెని విప్రులకు దానముచేసిరి. అనవేమ భూపాలుని దాతృత్వమును, రసికతను సూచించు చాటువు లెన్నియో ఆంధ్రదేశమున ప్రచారములో నున్నవి. అనవేమరాజు రాజ్యాంగసంబంధములగు కారణములవలన తన రాజధానిని శత్రుదుర్భేద్యమగు కొండవీటిదుర్గమునకు మార్చెను. అనవేమారెడ్డి మరణించినవెనుక నాతని యన్నకుమారుడగు కుమారగిరిరెడ్డి (1383-1400) సింహాసనమధిష్ఠించెను. ఈతడు తండ్రితాతలవలె గాక విశేషముగ విద్యావినోదములయందు కాలముగడపెను. కాని యీతని తోబుట్టువుభర్తయైన కాటయ వేమారెడ్డి మిక్కిలి సమర్థుడు. ఈ కాటయవేముడు రెడ్డి రాజ్యమునకు మంత్రియును దండనాథుడునై వేయికండ్లతో సంరక్షించుచుండినందున రాజ్యమున కెట్టి యుపద్రవమును సంభవింపలేదు. కుమారగిరిరెడ్డి వసంతోత్సవముల ననవరతము సలుపుచు సౌఖ్యముగా కాలము గడపెడివాడు. కుమారగిరిరెడ్డికి మిత్రుడును, ఆతని సుగంధభాండాగారాధ్యక్షుడునై

వసంతోత్సవములయందు ప్రభువునకు తోడ్పాటు పడుచుండెడి వైశ్యప్రముఖుడు త్రిపురారిశెట్టి యను నాతడొకడుండెను. ఈతని వైభవమును, ఈతడు కావించెడి విదేశవ్యాపారమును శ్రీనాథకవి రచితమగు హరవిలాసమందు వర్ణితమైయున్నది. క్రీ. పూ. పదునాల్గవ శతాబ్దియందుకూడ నాంధ్రవైశ్యులు నౌకావ్యాపారము విరివిగ చేయుచుండినట్లిందువలన వ్యక్తమగుచున్నది. కుమారగిరిరెడ్డి తండ్రియైన అనపోతరాజు కాలమున నాతని యాజ్ఞచే నాతని మంత్రియగు సోమనామాత్యుడొక శాసనమును ప్రకటించెను. ఆ శాసనమునందు విదేశవర్తకుల నాంధ్రదేశమునకు రప్పించుటకై యెన్నియో యానుకూల్యములు కావింపబడెను. ఆ కాలమునందు మోటుపల్లి గొప్ప రేవుపట్టణముగ నుండెను. ఆ పట్టణమునందు నివసింపగోరు వర్తకుల కన్ని సౌకర్యములు కల్గింపబడు ననియు, వారలకు భూములు నివేశనస్థలములు నిప్పింతుమనియు ప్రకటింపబడెను. విదేశములనుండి దిగుమతియగు వస్తువులపై సుంకములు తగ్గించియు, కొన్ని సందర్భములలో వానిని పూర్తిగ రద్దుచేసియు, అనపోతారెడ్డి నౌకావ్యాపారము నభివృద్ధి కావించుటకై యత్నించెను. కుమారగిరిరెడ్డి స్వయముగ విద్వాంసుడై వసంతరాజీయమను నాట్యశాస్త్రగ్రంథమును రచించెను. ఈ రాజు రాజ్యాంగవిషయములలో దూరదృష్టిలేక వర్తించి, తన రాజ్యమందలి తూర్పుభాగమును తన బావయగు కాటయవేమునకు పంచియిచ్చెను. ఈ యంశము పలువురు రెడ్డివీరుల కనిష్టము

కల్గించెను. కావున నీరాజు ననంతర మీతని కుమారుని రాజ్యమునకు రానీయక, యీతని జ్ఞాతి పెదకోమటి వేమారెడ్డి కొండవీటిరాజ్యమునకు ప్రభు వయ్యెను.

పెదకోమటి వేమారెడ్డికి, కొమరగిరి రెడ్డి కావించిన రాజ్యవిభాగ మెంతమాత్రము నంగీకారము కానందున నాతడు కాటయవేమారెడ్డిని రాజమహేంద్రవరరాజ్యమునుండి తొలగింపవలెనని యెంతయో యత్నించెను. కాని కృతకృత్యుడు కాజాలకపోయెను. ఈతని కాలమునందుకూడ పద్మనాయక వీరులు రెడ్డిరాజ్యమును జయింపవలెనని యత్నించిరి. కాని కోమటిరెడ్డి వారిని నిజపరాక్రమముచే నోడించి తరిమివైచెను. కోమటి వేమారెడ్డికి మామిడి సింగన యను నాత డమాత్యుడుగనుండెను. శ్రీనాథకవి యీతనికి తన నైషధకావ్యము నంకిత మొనర్చెను. కోమటి వేమారెడ్డి విద్వాంసుడును, విద్వత్కవిపోషకుడునైన ట్లాతడు వహించిన "సర్వజ్ఞచక్రవర్తి" యను బిరుదమే వేనోళ్ళ జాటుచున్నది. ఈ రాజు స్వయముగ అమరుక కావ్యమునకు శృంగారదీపిక యను వ్యాఖ్యానమును రచించెను. వామనభట్టను సుప్రసిద్ధపండితుడు వీరనారాయణ చరిత్ర మను పేరిట కోమటివేమారెడ్డి చరిత్రమును సంస్కృత భాషయందు రచించెను. ఈతని యాస్థానమందు శ్రీనాథ కవీంద్రుడు విద్యాధికారిగ నుండెను. వేమారెడ్డి గొప్పదాత యని కూడ పేరుమోసెను. ఈతని భార్య సూరాంబ యను నామె సంతానసాగరమను గొప్ప చెరువును నిర్మించెను.

వేమారెడ్డి స్వయముగ ప్రజాసౌఖ్యమునకై యెంతయో పాటు పడెను. ఈతడు వర్తక వ్యాపారముల నభివృద్ధి గావించుటకై యెంతయో యత్నించెను. ఈతని యంత్యదశయందు కొండవీటి రాజ్యమునకును, రాజమహేంద్రవర ప్రభువైన కాటయ వేమారెడ్డికిని తరచు యుద్ధములు సంభవించు చుండెడివి. అందు కోమటి వేమారెడ్డికే యెక్కువ నష్టములు సంభవించెను. కోమటి వేమారెడ్డి మరణించిన వెనుక నాతని కుమారుడు కొలదికాలము పాలించి మరణించెను. ఆ వెనుక కందుకూరును పాలించుచుండెడి రెడ్లు (ఈ వంశమువారే) మరికొంత కాలము రాజ్యపాలనము చేసిరి. కాని యనతికాలములో నీ భూభాగము తన స్వాతంత్ర్యమును గోల్పోయి విజయనగర ప్రభువుల సామంత రాజ్యముగ పరిణమించెను.

## రాజమహేంద్రవరపు రెడ్లు.

దేసటి కొమరగిరిరెడ్డి తన బావయగు కాటయ వేమారెడ్డికి రాజమహేంద్రవర రాజ్యము నొసంగెనని యిదివరకే తెలుపబడి యున్నది. కాటయవేము డచ్చట స్వతంత్రుడై వేరొక రెడ్డి రాజ్యమును స్థాపించెను. కొండవీటి ప్రభువైన పెదకోమటి వేమారెడ్డి కాటయవేముని పదభ్రష్టుని చేయుటకై యెంతయో యత్నించెను. కాని మహావీరుడగు కాటయవేము డాతనికి లొంగలేదు. ఈతడు తన రాజ్యము నుత్తరమున సింహాద్రివరకును విస్తరింపజేసెను. కళింగదేశమున నా కాలమున గజపతులను బలవత్తరులైన రాజులు పరిపాలనము చేయు

చున్నను కాటయ వేముడు తన రాజ్యమును పెంపొందింప గల్గుట యాతని సామర్థ్యమునకు తార్కాణము. విజయనగర రాజగు హరిహరరాయలు తన కుమార్తెను కాటయ వేమా రెడ్డి కుమారున కిచ్చి వివాహము చేసెను. కాటయ ప్రభుడు జనరంజకముగ పరిపాలనము చేసి దానధర్మముల విశేషముగ చేసెను. ఈతడు స్వయముగ మహావిద్వాంసుడు. ఈతనికి సంస్కృతి మభిమాన భాష. కాళిదాస మహాకవి నాటకముల కీతడు సంస్కృతభాష యందొక వ్యాఖ్యానమును వ్రాసెను. అయ్యది పండితులచే నుత్తమతరగతి వ్యాఖ్యాన మని ప్రశం సింపబడినది. మహావీరుడును, మహాపండితుడు నైన యీరాజు 1415 ప్రాంతమున మరణించెను. ఈతనికి పురుషసంతాన మున్నను, ఏ కారణము వలననో వారు రాజ్యమునకు రాక, యీతని సమీపబంధు వగు నల్లాడరెడ్డి యధికారమును వహిం చెను. అల్లాడరెడ్డి గొప్పవీరుడు. ఈతనికడ బెండపూడి లింగ నామాత్యుడను బ్రాహ్మణోత్తముడు మంత్రిగ నుండి రాజునకు మిక్కిలి సహాయపడె నని తెలియుచున్నది. ఆ కాలమునందు బ్రాహ్మణులు కేవల రాజనీతిజ్ఞులుగనే కాక యోధులై రణ రంగముల బాల్గొనుట గమనింప తగిన విషయము. అల్లాడరెడ్డి తురుష్క కటక కర్ణాట రాజులను జయించి ఖ్యాతి గాంచెను. ఈతని రాజ్యపాలనము జనరంజకముగ నుండెను. ఈతని యనంతర మీతని జ్యేష్ఠపుత్రుడు వేమారెడ్డి తన తమ్ముడగు వీరభద్రారెడ్డిని రాజుగ చేసి తా నాతనికి సహాయకుడై యుం

డెను. (1426–1430) ఈ సోదరు లిరువురు నన్యోన్య ప్రేమ గలవారై జయప్రదముగ రాజ్యపాలనము గావించిరి. వీరికి దొడ్డారెడ్డి, అన్నారెడ్డి యను తమ్ములు మిక్కిలి పరాక్రమ వంతులుండిరి. ఈ సోదరుల ప్రతాపము వలన రెడ్డి రాజ్య ముత్తరమున మహానది వరకును విస్తరించి కటక ప్రభువులగు గజపతులకు ప్రక్కలో బల్లెమై యుండెను. ఈ రెడ్డి రాజులు శైవమతాభిమానులై యుండియు, అన్యమతములను బాధింపక సహనభావముతో వర్తించిరి. వీరు బ్రాహ్మణుల కనేకములగు నగ్రహారముల నొసంగి వేదాదివిద్యలను పోషించిరి. వీర భద్రారెడ్డి భార్యయైన అనితల్లి ఆయుర్వేదమునందు మహా సమర్థుడగు బ్రాహ్మణున కొక్కనికి అన్నవరమను గ్రామమును దానము చేసెను. వీరభద్రారెడ్డికి మంత్రిగ నుండిన బెండపూడి అన్నయామాత్యుడు మిక్కిలి సమర్థుడని తెలియుచున్నది. ఆతడు బహుభాషాకోవిదుడు. ఫారసీ భాషలో కూడ నీతడు సామర్థ్యమును సంపాదించెనట. ఈ మంత్రి గొప్ప రాజనీతి జ్ఞుడు. ఈతనికి శ్రీనాథుడు భీమఖండము సంకిత మొనర్చెను. వీరభద్రారెడ్డికి శ్రీనాథకవి తన కాశీఖండమును కృతి యొసం గెను. ఇరువదియైదు సంవత్సరములపాటి రెడ్డివీరులు రాజ మహేంద్రవరమున వైభవముతో రాజ్యపాలనము చేసిన తరు వాత వారిపై యవన కర్ణాట కళింగరాజులు దండెత్తిరి. రెడ్డి వీరులు మహా ధైర్యముతో పోరాడిరి. కాని శత్రుసైన్యములు బలవత్తరములైనందున వారిని గెలువలేక యుద్ధరంగమున

ప్రాణముల విడచి వీరస్వర్గ మలంకరించిరి. ఇంతటితో రాజ మహేంద్రవర మందలి రెడ్డి రాజ్యము నశించెను.

## శ్రీనాధకవి — ఇతరకవులు.

కవిసార్వభౌముడైన శ్రీనాధ మహాకవి రెడ్డి యుగమున కలంకారభూతుడై యుండిన మహనీయుడు. ఈతడు కొంతకాలము కొండవీటి రెడ్ల కడను, తదనంతరము రాజ మహేంద్రవరపు రెడ్ల కడను నివసించి వారి కనేకగ్రంధముల నంకిత మొనర్చెను. ఈ కవిశ్రేష్ఠుడు నైషధము, భీమఖండము, కాశీఖండము మున్నగు నుత్తమ గ్రంథములను రచించెను. ఈ కవిరాజు కవిత్వ ప్రాశస్త్యము లోకవిదితము. శ్రీనాధుని కృతుల వలన రెడ్డి సామ్రాజ్యవైభవము, ఆనాటి యితర సుప్రసిద్ధ పురుషుల జీవితములు, కొండవీడు, రాజమహేంద్రి వరము మున్నగు పురముల యున్నతి, మొదలగు ననేకాంశ ములు తెలియవచ్చు చున్నవి. ఈ కాలమునందు నిశ్శంక కొమ్మనామాత్యుడు, దగ్గుబల్లి దుగ్గనామాత్యుడు మున్నగు నితర కవిశ్రేష్ఠులు జీవించి తమ యుత్తమ కావ్యముల రచించిరి. రెడ్డియుగమునకు వన్నెదెచ్చిన మహనీయులలో వేమన యోగి యొకడు. ఈతడు గొప్పజ్ఞాని. ఈయన చక్కని తేట తెనుగున నీతిబోధకములును, జ్ఞానదాయకములు నగు గీతము లను రచించెను. వీనిని పండిత పామరు లందరును నేటివరకును చదివి, మననము చేసి యానందించు చున్నారు.



# విజయనగర సామ్రాజ్యము




దక్షిణ భారతము.

# ఆంధ్రుల చరిత్ర

## విజయనగర సామ్రాజ్యము

### ఆంధ్రులచరిత్రలో స్వర్ణయుగము

ఆంధ్ర దేశీయచరిత్రలో విజయనగర రాజన్యుల యుగము మిక్కిలి తేజోవంతమైన ఘట్టము. ఆంధ్రప్రతాపము, ఆంధ్ర వైభవము, ఈ కాలములో మహోన్నతదశను పొందెను. ఈ యుగమందు ఆంధ్రభాషయు, కళయు చాల అభివృద్ధిగాంచెను. మహమ్మదీయదండయాత్రలను అపారపారావారము హిందూ జాతిని, నాగరకతను ముంచెత్తివేయకుండ విజయనగరసామ్రాజ్యము రెండుశతాబ్దులు పైబడి సంరక్షించెను.

### విజయనగర రాజ్య స్థాపనము

క్రీ. వె. పదునాల్గవశతాబ్ది యారంభమునుండి మహమ్మదీయులు దక్షిణహిందూదేశముపై దండెత్తుట ప్రారంభించిరి. 1307 సంవత్సరమున దేవగిరిరాజ్యమును, 1310 యందు ద్వారసముద్రరాజ్యమును, 1328 నందు కాకతీయప్రభుత్వమును మహమ్మదీయులు కూలద్రోసిరి. దక్షిణభారతదేశమున హిందూధర్మమును, సంస్కృతిని పోషింపగల బలవత్తరమగు

ప్రభుత్వమేదియును లేదయ్యెను. పరిస్థితులను గమనించుచున్న హైందవజాతియందు స్వమత, స్వజాతి, స్వీయసంస్కృతులను సంరక్షించుకొనుటకై యొక సామ్రాజ్యమును స్థాపింపవలయు ననెడి తీవ్రమగు కోరిక యుద్భవించెను. ఈ తీవ్రమగుకోర్కెకు ఫలితమే విజయనగరసామ్రాజ్యము. ఈ సామ్రాజ్యస్థాపనమును గూర్చి చరిత్రకారులు భిన్నాభిప్రాయులైయున్నారు. ఈ రాజ్యమును బల్లాలరాజుల అనుయాయులు స్థాపించిరని యొకపక్షము వారును, కాకతీయరాజులకడ నుండెడి యుద్యోగులు స్థాపించిరని మరికొందరును తలంచుచున్నారు. తుంగభద్రాతీరమందలి ఆనెగొందెరాజ్యము నాశనముకాగా ఆ ప్రభుత్వమునకు చెందిన కొందరు సాహసులీ నూతనసామ్రాజ్యమునకు పునాదివైచిరని మరికొందరు తెల్పుచున్నారు. ఏది యెట్లున్నను 1336 సంవత్సరమున హరిహరుడు, బుక్కరాయలు అను నిద్దరు సోదరులీ నూతనరాజ్యమును స్థాపించిరనుట నిర్వివాదాంశము. వీరికి మాధవ విద్యారణ్యులను మహనీయుడీ మహత్కార్యమున నెంతయో సహాయము గావించెను. ఈ మాధవ విద్యారణ్యులును, ఈతని సోదరుడగు సాయణులును కలసి వేదభాష్యమును, ఇతర మహద్గ్రంథములును రచించిరి. తుంగభద్రానదికి దక్షిణ తీరమున విద్యానగరపురమును నిర్మించు విషయమునకూడ విద్యారణ్యులు హరిహరరాయలకు ప్రోత్సాహ మొసంగినట్లు తెలియుచున్నది. ఈ ప్రదేశము దుర్గమములగు పర్వతపంక్తుల నడుమనుండి శత్రువుల కభేద్యముగ నుండుటవలన రాజధాని

నగరముగ నేర్పరుపబడెను. దీని కేడు ప్రాకారము లుండెనట. వెలుపలి ప్రాకారములందు కృషీవలులు మున్నగువారు వసించుచుండెడివారు. లోపలిప్రాకారములలో రాజమందిరము లుండెడివి. ఈ పట్టణము పదునాల్గు మైళ్ళు పొడవును, పది మైళ్ళు వెడల్పును కలిగి జనసంకులముగ నుండెడిది. ఈ పట్టణము మిక్కిలి యుచ్ఛదశయం దున్నప్పు డిందలి జనసంఖ్య ముప్పది లక్షలవరకు నుండియుండవచ్చునని తలంపబడుచున్నది. హరిహరరాయలు విజయనగర రాజ్యమును స్థాపించి పదునాల్గు సంవత్సరములకాలము (1336–1350) దానిని పాలించినట్లు తెలియుచున్నది.

## బుక్క రాయలు

హరిహరరాయల యనంతర మాతని సోదరుడగు బుక్కరాయలు సింహాసన మధిష్ఠించెను. ఈతడు గొప్పవీరుడు. హరిహరరాయలు రాజ్యముచేయుచున్న కాలమునందే (1347) మహమ్మదీయులు గుల్బర్గా పట్టణమును రాజధానిగ జేసికొని బహమనీరాజ్యమును స్థాపించిరి. విజయనగరరాజులకును బహమనీరాజులకును తరచు యుద్ధములు సంభవించుచుండెడివి. బుక్కరాయ లీ యుద్ధములలో తరచుగ జయము పొందినట్లు కాన్పించుచున్నది. ఈ రాజు కళింగ, ఓఢ్రదేశములను జయించినట్లు తెలియుచున్నది. బుక్కరాయలు గొప్పవీరు డగుటయే గాక విద్యాపోషకుడైనట్లుకూడ తోచుచున్నది. ఈతనికాలము

నందే మాధవసాయణులు వేదభాష్యమును రచించి, ఆ యుత్తమగ్రంథము నీతని కంకితము గావించిరి. ఈ రాజు కాలమునందు రాజధానియగు విద్యానగర మెంతయో యభివృద్ధిగాంచెను. వాణిజ్యమును, కృషియుగూడ బుక్కరాజుచే చాలప్రోత్సాహమును గాంచెను. కృషీవలుల కెట్టి యిక్కట్టులును కలుగకుండ నీ రాజు భూమిశిస్తునుగూర్చి తగు నియమముల నేర్పాటుచేసెను. బుక్కరాయలు వైదికమతాభిమానియయ్యు, ఇతరమతములనుకూడ రక్షించెను.

## రెండవ హరిహరరాయలు

బుక్కరాయల యనంతర మాతని కుమారుడు రెండవ హరిహరరాయుడు రాజయ్యెను. (1377–1404) ఈ రాజు మహామండలేశ్వరు డను బిరుదమును వహించినందున నీతని కాలములో విజయనగరరాజ్య మింకను అభివృద్ధి చెందినట్లు తలంపవచ్చును. ఈతనిశాసనములు దక్షిణమున తిరుచునాపల్లి వరకును కాన్పించుచున్నవి. రెండవ హరిహరరాయల కాలమునందు ప్రజ లెట్టి కష్టముల నెరుంగక సుఖముగా నుండిరనియు, వారు తమ ప్రభువులయెడ గల భక్తివిశ్వాసముల జూపుటకై తమంతతామే కొన్నిపన్నుల నిచ్చుటకై యంగీకరించిరనియు, తెలుపు శాసనములు బయటపడినవి. ఆ కాలమునందు వర్తక సంఘములు ప్రతిముఖ్యపట్టణమందును ఉండెడివి. అట్టి వర్తక సంఘములు కొన్ని సమావేశమై తమ ప్రభువులకు తాము వ్యాపారముచేయు వివిధవస్తువులపై పన్నులిచ్చుట కంగీకరించి

నట్లు పై శాసనములవలన దేలుచున్నది. ఈ రాజుకూడ తన పూర్వులవలెనే వైదికమతము నాదరించెను.

## రెండవ బుక్కరాయలు

రెండవ హరిహరరాయల యనంతరము రెండవ బుక్కరాయలు రాజయ్యెను. (1404–1422) ఈతనికి దేవరాయలను నామాంతరముకూడ నున్నట్లు తెలియనగుచున్నది. ఈ రాజు గోవా మున్నగు పట్టణములను, తూర్పుసముద్రప్రాంతమును జయించెను. ఈ బుక్కరాయని కాలమునందు విజయనగరరాజులకును, బహమనీరాజులకును మూడుపర్యాయములు యుద్ధము సంభవించెను. బహమనీరాజులు విజయనగరరాజ్యములోని దుర్గముల నాక్రమించుటకై యత్నించియు కృతకృతులు కాజాలరైరి. కాని యిరుపక్షముల వారికిని సైన్యనష్టము విశేషముగ సంభవించెను. బుక్కరాయలు ప్రజాక్షేమమునకై యెంతయో పాటుపడెను. ఈతడు విజయనగర పట్టణములో నీటివసతికై యొక కాల్వను త్రవ్వించి తన రాజధానియందు జలసమృద్ధి కలుగజేసెను. ఇందులకై విశేషధనమును వ్యయముచేసి తుంగభద్రానది కానకట్ట కట్టించెను. బుక్కరాయలు సంస్కృతాంధ్రకర్ణాటకభాషల పోషించినట్లు నిదర్శనములు కానవచ్చుచున్నవి.

## రెండవ దేవరాయలు.

రెండవ బుక్కరాయలు మరణింపగా నాతని మనుమడు రెండవ దేవరాయలు (1423–1446) రాజయ్యెను. ఈతని

కాలములో కూడ విజయనగర బహామనీ రాజ్యములకు యుద్ధములు జరుగుచునే యుండెను. కాని యే పక్షమువారును సంపూర్ణముగ నోడుట తటస్థింపలేదు. న్యూనిజ్ అను పోర్చుగీసు దేశస్థు డొకడా కాలములో విజయనగరమును సందర్శించెను. ఆతడు వ్రాసిన వ్రాతల వలన ఆ కాలమునందు విజయనగర రాజులు చాల ధనవంతులుగ నున్నట్లు తెలియుచున్నది. దూర దేశములందలి రాజులు కూడ విద్యానగర ప్రభువులకు వశంవదులై కప్పము కట్టుచుండిరట. రెండవ దేవరాయలు తన సైన్యమునందు చాల మార్పులు కావించి, అం దాశ్వికసైన్యమును, విలుకాండ్రను మిక్కిలి పెంపొందించెనని తెలియుచున్నది. మహమ్మదీయులతో జరుగు యుద్ధములయందు తన సైన్యములు నష్టపడకుండుటకై యీతడీ సంస్కరణమును కావించెనని చరిత్రలు తెల్పుచున్నవి. దేవరాయల కాలమందు పారసీక రాజగు షారుఖ్ అను నాతడు అబ్దుల్ రజాకు అను రాయబారిని విజయనగర రాజుల కడకు పంపెనని తెలిసికొన్నప్పుడీ రాజ్యమెంతటి యున్నతస్థితియందుండెనో తెలియనగుచున్నది. దేవరాయలు ప్రజాక్షేమమునకై యెంతయో పాటుపడినట్లును ఆతడు వ్యవసాయాభివృద్ధికై కాలువలను త్రవ్వించినట్లును మనకు తెలియనగుచున్నది.

## ప్రథమ వంశావసానము.

రెండవ దేవరాయల యనంతరము విజయనగర రాజ్యమున కొంతకాలము వరకు సమర్థులగు రాజు లెవ్వరును లేరు

డిరి. వారిలో విరూపాక్షు డను రాజు విషయలంపటుడును, అసమర్థుడు నైనందున, తురుష్కులు విజయనగర రాజ్యమందలి పెక్కు దుర్గములను, గోవాపట్టణమును తమ వశము కావించుకొనిరి. 1487 వ సంవత్సరమున నీ వంశమందలి తుది రాజు రెండవ విరూపాక్షరాయలను తొలంగించి యాతని దండనాథుడగు సాళువ నరసింహరాజు సర్వజనాంగీకారముపై విజయనగరమునకు రాజయ్యెను.

## సాళువ వంశము.

సాళువ నరసింహరాజు మూడు సంవత్సరములు మాత్రము (1487–1490) రాజ్యపాలనము చేసెను. ఈతడు గొప్ప శూరుడై, అన్యరాజులచే నాక్రమింపబడిన విజయనగర రాజ్య ప్రాంతముల మరల జయించెను. కాని ఉదయగిరి, కొండవీడు, రాయచూరు, అను దుర్గములను సాధింపజాలక పోయెను. ఈ నరసింహరాజు కాలమున పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడను విఖ్యాతకవి జైమినీ భారతమును రచించెను. సాళువ నరసింహరాజు మరణించిన వెనుక నాతని ప్రథమ పుత్రుడును, ఆతని మరణానంతరము రెండవ కుమారుడును సింహాసన మధిష్ఠించిరి. కాని వీరిరువురును బాలురైనందున తుళువ నరసరాజను దండనాథుడు వీరికి సంరక్షకుడుగ నుండెను. మరి కొంత కాలమైన తరువాత తుళువ నరసరాజే రాజ్యాధికారము బూనినందున నీతడు సాళువ నరసింహరాజు రెండవ కుమారుని చంపియుండ వచ్చునని యూహింపబడుచున్నది.

## తుళువ వంశము.

తుళువ నరసరాజు గొప్ప శూరుడగుట వలన రాజ్యము నందలి సరదారు లందరు నీతనికి వశంవదులైరి. ఈరాజు పెక్కు రాజ్యములను జయించినట్లు నిదర్శనములు కలవు. విజయనగర రాజ్యము నీతడు బలపరచెను. ఈ నరసరాజు కవులను, విద్వాంసులను పోషించెను. ఈతని యాస్థానమున నంది మల్లయ్య, ఘంట సింగయ్య యను నిర్వురు కవిశ్రేష్ఠు లుండిరి. వారిరువురును కలసి వరాహపురాణము, ప్రబోధచంద్రోదయము, అను గ్రంథముల రచించిరి. నరసరాజు మరణించిన వెనుక ఆతని జ్యేష్ఠపుత్రుడు వీరనరసింహరాయలు రాజయ్యెను. కాని యీతడు మూడు నాలుగు సంవత్సరములు మాత్రము రాజ్యముచేసి మరణించెను. ఆతని యనంతర మాతని సవతి తమ్ముడగు కృష్ణదేవరాయలు రాజ్యాధిపత్యమును వహించెను. ఈతనికి సాళువ తిమ్మరాజను మంత్రిశ్రేష్ఠుని సహాయము లభించుట వలన విజయనగర సింహాసన మతనికి లభించెనని తెలియుచున్నది.

## శ్రీ కృష్ణ దేవ రా య లు.

కృష్ణదేవరాయలు 1509 వ సంవత్సరమున సింహాసనారూఢుడయ్యెను. ఈతడు విజయనగర రాజులలో సర్వశ్రేష్ఠుడు మాత్రమే కాక భారతదేశచరిత్ర యందలి యుత్తమప్రభువులలో నొక్కడుగ పరిగణింపబడుచున్నాడు. ఈత డాంధ్ర

భావను పోషించి, స్వయముగ నాంధ్రమున కావ్యముల రచించి యాంధ్రప్రపంచమునకు శాశ్వతోపకారము గావించెను. ఈ రాజు మహావీరుడై విజయనగర రాజ్యవైభవము ననేక విధముల పెంపొందించి, యరిభీకరుడై వెలింగెను. ఈ ప్రభువు ఆంధ్రుల కెల్లరకును మా దేశస్థుడని తెల్పి గర్వించుటకు తగినవాడు.

కృష్ణదేవరాయని యన్నయగు వీరనరసింహారాయడు అవసానకాలమున తన మంత్రియగు సాళువ తిమ్మరాజును పిలువనంపి తన యనంతరము తన కుమారుని రాజును గావింపవలయు ననియు, ఆతని మార్గమున కంటకముగ నుండకుండ తన సవతి తమ్ముడగు కృష్ణరాయని చంపవలసిన దనియు కోరెనట. కాని తిమ్మరాజు కృష్ణదేవరాయడనిన మొదటి నుండియు అభిమానము కలవాడు గావున నట్లు చేయక యతనిని కాపాడెనట. కృష్ణరాయని బుద్ధికుశలతను, సామర్థ్యమును ధైర్య శౌర్యములును చూచి తిమ్మరాజే అతనిని రాజును కావించెనని చరిత్రల వలన దెలియుచున్నది. కృష్ణదేవరాయని రాజ్యకాలము మిక్కిలి ప్రకాశవంతమగుట కాతనిని గొల్చిన సేనానులును, మంత్రి పుంగవుడును కారకులు. ఈ మంత్రిశ్రేష్ఠుడు సాళువ తిమ్మరాజు. ఈత డార్వేల నియోగి బ్రాహ్మణుడు. ఈ తిమ్మరాజు తన మేధాసంపత్తిచే కడు బీద దశనుండి యత్యున్నత దశకు రాగల్గెను. ఈతడు గొప్ప రాజనీతిజ్ఞుడు.

కృష్ణరాయని దిగ్విజయము లీ మంత్రిపుంగవుడు కావించిన చక్కని యేర్పాట్లవలననే సాధ్యమయ్యెను.

## రా య ల వి జ య ప రం ప ర.

కృష్ణదేవరాయలు రాజ్యమునకు వచ్చిన రెండు మూడు సంవత్సరముల వరకును తన సైన్యము నభివృద్ధి పరచుటలో నిమగ్నుడై 1512 లో శత్రురాజులపై దండయాత్ర సాగించెను. మొట్టమొదట నాతడు శివసముద్రపు కోటను, తరువాత శ్రీరంగ పట్టణమును జయించెను. తరువాత కొడగు, మళయాళ దేశముల జయించి యిచ్చటి దొరల నెల్ల తన సామంతులుగ జేసికొనెను. ఆ పైన కర్ణాటదేశమునంతను తన యధీనము లోనికి తీసికొని వచ్చెను. ఇట్లు జయింపబడిన దేశమునంతను రాయలు మూడు భాగములుగ విభజించి తనకు వశవర్తులైన నాయకుల యధీనములో నుంచి యసంఖ్యాకధనమును కప్పముగ గైకొని తన రాజధానికి మరలివచ్చెను. ఈ కాలము నందే తెనుగు బ్రాహ్మణులు, రెడ్లు మున్నగు వారి దేశములకు వలసపోయి యచ్చట స్థిరనివాస మేర్పరచుకొనిరి. దక్షిణదేశ దిగ్విజయము పూర్తియైన వెనుక రాయలు తన సైన్యములను తూర్పునకు మరలించి గజపతుల యధీనమందున్న ఉదయగిరి, కొండవీడు దుర్గముల జయించెను. ఈ సందర్భముననే రాయలు కటకపురాధీశ్వరుడగు ప్రతాపరుద్ర గజపతి నోడించి, వెనుకకు తరిమివైచెను. అంతటితో నాగక రాయలు కటకపురాధీశ్వరుని

వెన్నంటి సింహాచలము వరకుగల దేశము నంతను జయించి, పొట్నూరను ప్రదేశమున తన జయస్తంభమును నాటించి విజయనగరమునకు మరలివచ్చెను. కృష్ణదేవరాయలు 1520 వ సంవత్సరమున గొప్ప సైన్య సన్నాహముతో బయలుదేరి రాయచూరు దుర్గమునకు ముట్టడివేసి తనతో పోరవచ్చిన బీజాపూరు సుల్తానును సంపూర్ణముగ పరాభవించి తుద కా దుర్గమును కైవసము చేసికొనెను. ఈ విజయముల వలన రాయల సామ్రాజ్యము విస్తరించుటయే కాక రాయల కీర్తి చంద్రికలు దశదిశల వ్యాపించెను.

## రా య ల భా షా పో ష ణ.

కృష్ణదేవరాయలు వీరుడు మాత్రమేకాదు. ఇతడు విద్యాప్రియుడు, స్వయముగ గొప్పకవి. ఈ రాజు ఆముక్త మాల్యద యను నుత్తమ పద్యకావ్యము నాంధ్ర భాషయందు రచించెను. ఇందలి కవిత్వము ప్రౌఢమై పండితైక వేద్యమై యుండును. ఇవికాక మదాలసచరిత్ర, సత్యభామాపరిణయము అను సంస్కృత ప్రబంధముల నీ రాజు వ్రాసినట్లు తెలుపబడు చున్నది. ఈ విద్యాభోజుని యాస్థానము గొప్ప కవులకును, పండితులకును నిలయమై యుండెను. ఈ కవులలో యెనిమిది మంది సుప్రసిద్ధులై అష్టదిగ్గజములను పేర ఖ్యాతిగాంచిరి. అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, రామరాజ భూషణుడు, అయ్యలరాజు రామభద్రుడు, మాదయ్యగారి మల్లన, ధూర్జటి,

పింగళి సూరన, తెనాలి రామకృష్ణుడు అనువారు రాయల యాస్థానమందలి కవీంద్రులని వాడుక కలదు. ఇందు కొందరు కవీంద్రులు రాయలకు సమకాలీనులు కారు. ఏది యెట్లున్నను వీరందరును ఆంధ్ర భాషకు గొప్ప సేవ చేసిన మహానీయు లనుటలో సందేహములేదు. ఈ కవిశ్రేష్ఠులు పూర్వకవులవలె సంస్కృత గ్రంథముల భాషాంతరీకరించుట మాని స్వతంత్రి ప్రబంధముల వ్రాయనారంభించిరి. స్థలసంకోచమువలస వీరి గ్రింథములను వేర్వేర పేర్కొనుటలేదు. ఇందు అల్లసాని పెద్దన యను మహానీయుడు మనుచరిత్ర మను స్వతంత్ర్యకావ్య మును వ్రాసి, ఆంధ్రకావ్య ప్రపంచమున నొక్క క్రొత్త పోక డను కల్పించెను. ఇట్టి మహాకవుల కాశ్రియ మొసంగిన రాయ లాంధ్రుల శాశ్వతకృతజ్ఞతకు బాత్రుడు. మహావీరుడును, కవియు, విద్యాపోషకుడును, ఆంధ్రభోజుడును అగు శ్రీ కృష్ణ దేవరాయ చక్రవర్తి 1530 వ సంవత్సరమున కాలధర్మము నొందెను.

## అచ్యుతరాయలు.

శ్రీకృష్ణదేవరాయనికి పుత్రసంతానము లేనందున నాతని సవతి తమ్ముడగు నచ్యుతరాయలు సింహాసన మధిష్ఠించెను. ఈతని కాలమున విజయనగర రాజ్యము విస్తరింపక పోవుటయే గాక కొంత నష్టమునుకూడ పొందెను. అచ్యుత రాయలు భీరుడును సాహసహీనుడు నైనందున తురుష్కులు

రాయచూరు, ముదగల్లు దుర్గముల నాక్రమించుకొనిరి. కాని రాజ్యమునందు సమర్థులగు సేనానులు పలువు రున్నందున నింతకుమించి యెట్టి నష్టమును సంభవింపలేదు. కృష్ణదేవ రాయల కాలమునందే విజయనగరమును సందర్శించిన పోర్చు గీసు యాత్రికుడు న్యూనీజు, అచ్యుతరాయల రాజ్యవిస్తార మును, ధనసమృద్ధియు, రాయలయొక్క దేవేంద్రభోగము మున్నగు నంశములను కూర్చి తెలిపియున్నాడు. అచ్యుత రాయలు పన్నులు విశేషముగ గైకొని ప్రజలను కొంతవరకు బాధించినట్లు తెలియుచున్నది. కాని గుళ్ళు గోపురములు మున్నగువాని నీత డెన్నియో కట్టించెను. ఈ రాజు తన తోడి యల్లుడగు చెవ్వప్పనాయకు డను నాతనిని తంజావూరు రాజ్య మునకు ప్రభువుగ నియమించెను. పండ్రెండు సంవత్సరములు రాజ్యముచేసి అచ్యుతరాయలు 1542 లో మరణించెను.

## రామరాయలు - విజయనగరరాజ్య పతనము

అచ్యుతరాయని మరణానంతరము విజయనగర రాజ్యము నం దల్లకల్లోలములు ప్రారంభించెను. ఈతని కుమారుడు రాజ్యాధిపత్యము వహించగా నాతనిని సలకము తిమ్మయ యను మంత్రి చంపించి తానే స్వయముగ రాజయ్యెను. రాజ్యము నందు వేరొకపక్ష ముండెను. దానికి కృష్ణదేవరాయల యల్లు డైన అళియరామరాజు నాయకుడు. ఈ పక్షమువారు సలకము తిమ్మయ యధికారము నంగీకరింపక కృష్ణదేవరాయల తమ్ము

డగు సదాశివరాయలను రాజును కావించిరి. తన పక్షము బల హీనమైనదని యెరింగి సలకము తిమ్మయ ఆత్మహత్య కావించు కొనెను. సదాశివరాయలు నామమాత్రమునకు రాజుగ నుండెను. కాని నిజమైన యధికారమంతయు రామరాయలే వహించెను. కొంతకాలము గడచిన తర్వాత రామరాజు సదాశివ రాయలను పదభ్రష్టునిగావించి స్వయముగ రాజయ్యెనని కొందరు చరిత్రకారులు తలంచుచున్నారు. ఇది సత్యమైనను కాక పోయినను సదాశివరాయల పేరున రామరాజే విజయనగర రాజ్యము నేలెననుటలో యెట్టి సందేహములేదు. రామరాజు గొప్పవీరకుటుంబములో జన్మించినవాడు. ఈతని ముత్తాత యగు ఆర్వీటి బుక్కరాజు సాళువ నరసింహరాజునకు కుడి భుజమువలె పనిచేసి 'సాళువ నరసింహరాయ రాజ్యప్రతిష్ఠాప నాచార్య' అను బిరుదమును మోసెను. రామరాయుని సోదరులు తిరుమలుడును, వేంకటాద్రియును కూడ రణకుశలురు. ఇట్టి సోదరుల సహాయముతో రామరాజు 1565 వరకు నిరంకుశముగను, గొప్పవైభవముతోడను పాలించెను. రామరాజు కాలమున విజయనగరరాజ్యము కీర్తి, ప్రతిష్ట లనేకగుణములు పెంపొంది, ఇయ్యది యవనరాజులకు ప్రక్కలో బల్లెమువలె మెలగసాగెను. రామరాయలు తనకుటిలరాజనీతిచే గోలకొండ, బిజాపూరు, అహమ్మద్‌నగర రాజ్యములలో విభేదములు కల్పించి ఒక్కొక్కపర్యాయము తానొక్కొక్కరి పక్షము నవలంబించి తురుష్కసుల్తానుల నందరను సంపూర్ణముగ పరాభ

వించెను. రామరాజు రాజ్యగర్వముచే తురుష్కప్రభువులను, వారి రాయబారులను పలుమారు లవమానించెను. ఈయుద్ధములలో హిందువులు చెలరేగి తురుష్కులపై యెన్నియో అత్యాచారముల కావించినట్లు తెలియుచున్నది. తమ హీనస్థితిని గుర్తించియు, విజయనగర రాజ్యవైభవము నెడ నసూయ చెందియు, తురుష్కసుల్తాను లందరు నేకమై రామరాజుతో పోరాడుటకు గొప్పసైన్యమును సిద్ధముచేసిరి. రామరాజుకూడ బ్రహ్మాండమగు సేనతో బయలువెడలి తురుష్కసైన్యములను తాళికోట యనుచోట తాకెను. 1565 వ సంవత్సరమున జనవరి నెలలో తాళికోటవద్ద విజయనగర ముసల్మానుసేనలకు భయంకరమగు యుద్ధము జరిగెను. హిందువులు సాహసముతో పోరియు, తుట్టతుదకు తురుష్కులచే సంపూర్ణముగ పరాభవింపబడిరి. రామరాజు యుద్ధములో మడసెను. ఇంతటితో విజయనగర రాజ్యవైభవము నశించెను. రామరాజు సోదరులగు తిరుమల వేంకటాద్రులు రాజగు సదాశివరాయలను తీసికొని పెనుగొండకు పారిపోయిరి. తురుష్కులు విజయనగరపట్టణముపై బడి భూలోకస్వర్గమువలెనుండెడి యీ మహానగరమును సర్వవిధముల నాశనముచేసి యసంఖ్యాకమగు ధనరాసులతో మరలిపోయిరి.

## విజయనగర రాజ్యపు విశిష్టత.

విజయనగర సామ్రాజ్య మిన్నూరు సంవత్సరముల పైబడి దక్షిణ భారతదేశమున హైందవ నాగరకతకును, జాతి

కిని పెట్టని కోటయై యొప్పెను. కృష్ణానదికి దక్షిణమున నున్న హిందూదేశమంతయు నీ రాజుల యధికార మందుండెను. వీరి పలుకుబడి యితర రాజ్యములలో కూడ విశేషముగ నుండి, రామరాజు కాలములో నయ్యది మిక్కిలి యున్నతదశను పొందెను. విజయనగర రాజ్యము హిందూ నాగరకతను రక్షించె ననుట వలన నా రాజ్యము మహమ్మదీయులయెడ శత్రుత్వము వహించెనని తలంపరాదు. విజయనగర ప్రభువులు మతసహన బుద్ధిగలవారై యన్ని మతములను రక్షించిరి. విజయనగర పట్టణమున తుర్కి మొహల్లా యనువాడయు, అందు మసీదులు నుండుటయే దీనికి తార్కాణము. వీరి సైన్యములో మహమ్మదీయులు పలువురు కొలువు చేయుచుండెడి వారని కూడ తెలియనగు చున్నది. విజయనగర రాజ్యకాలమున ఆంధ్రభాష యెంతయో యున్నతిని గాంచినట్లీవరకే తెలుపబడి యున్నది. ఆంగ్ల వాఙ్మయ చరిత్రయం దెలిజబెత్తు రాణి యుగ మెంతటి ప్రశస్తిని గాంచినదో ఆంధ్రభాషకు ముఖ్యముగా శ్రీకృష్ణ దేవరాయని కాలమట్టిదని తెలుపవచ్చును. ఈ రాజులు గీర్వాణ భాషను కర్ణాటభాషనుకూడ చక్కగ పోషించిరి. విజయనగర రాజుల కాలమునందు శిల్పకళ కూడ బాగుగ వృద్ధిపొందెను. విద్యానగరమును సందర్శించిన విదేశయాత్రికు లా నగర వైభవమును, సౌందర్యమును చూచి యిట్టి పట్టణము ప్రపంచములో మరెచ్చటనైన యుండునా యని యక్కజపడి రని తెల్పినప్పుడా పట్టణశోభను మన మొకించుక యూహించుకొన

జాలుదుము. విజయనగర ప్రభువు లనేక దేవాలయములను నిర్మింపించిరి. అందు పంపాపతి దేవాలయము, కృష్ణస్వామి దేవాలయము, హజార రామస్వామి యాలయము, విఠలేశ్వరుని మందిరము మున్నగునవి ప్రత్యేకముగ ప్రశంసింప దగినవి. ఇవికాక కృష్ణదేవరాయ లుగ్రనరసింహ విగ్రహ మొకదానిని చెక్కించెను. అయ్యది నేటికిని దర్శనీయమై యున్నది. విజయనగర రాజులు ప్రజోపయోగమునకై కాలువలు చెరువులు మున్నగువాని నెన్నిటినో నిర్మింపజేసిరి. కృష్ణదేవరాయ లొక గొప్ప తటాకమును నిర్మించుటకై యొక పోర్చుగీసు ఇంజనీయరును పిలిపించి యాతనిచే తటాకనిర్మాణము కావింపించెనట. ఇందుల కిరువది వేలమంది కూలీలు పనిచేసిరట. విజయనగర సామ్రాజ్య మాంధ్రకర్ణాట ప్రాంతములు రెండింటి యందును వ్యాపించి యుండెను. విజయనగర పట్టణము మాత్రము కర్ణాట ప్రాంతమున నెలకొని యుండెను. కావున విజయనగర సామ్రాజ్య మాంధ్రకర్ణాటుల కిరువురకును చెందిన రాజ్యమని చెప్పనగును.



# ఆంధ్రుల చరిత్ర



## తంజావూరు ఆంధ్రనాయకులు



### తాళికోటసంగ్రామము తర్వాత విజయనగరరాజ్యము

తాళికోటయుద్ధము తరువాత విజయనగర రాజ్య వైభవము క్షీణించెను. రామరాజు సోదరులు తిరుమలవేంకటాద్రులు పెనుగొండకు పారిపోయి యచ్చట కొంతకాలము రాజ్యపాలనము చేసిరి. ఈ వంశ మారవీటివంశ మని చరిత్రలయందు పేర్కొనబడుచున్నది. ఈ వంశపురాజులలో సమర్థులని చెప్పదగినవా రెవ్వరును లేనందున నింతకుపూర్వము విజయనగర రాజ్యమునకు సామంతులుగనున్న రాజులు స్వతంత్రులై ఆయా ప్రాంతములలో రాజ్యము సేయదొడంగిరి. ఈ రాజ్యములలో మధురతంజావూరులయందలి ఆంధ్రనాయకులు ప్రముఖులు. కొన్ని సందర్భములలో నీ సామంతరాజ్యములే కేంద్రరాజ్యము కంటె బలవత్తరములై అచ్చటి రాజులకు సాహాయ్యముచేయుచుండెను. ఈ కేంద్రరాజ్యము తన రాజధానిని పెనుగొండ నుండి చంద్రగిరికిని, చంద్రగిరినుండి వెల్లూరునకును మార్చవలసివచ్చెను. కొంతకాలమున కీ రాజ్యము బిజాపుర, గోలకొండప్రభువులచే జయింపబడి యంతర్థాన మయ్యెను.

# చెవ్వప్ప నాయకుడు

తంజావూరునందలి యాంధ్రనాయకరాజ్యము విజయనగరరాజగు నచ్యుతరాయలకాలమున స్థాపింపబడెను. అచ్యుతరాయలు తన తోడియల్లుడైన చెవ్వప్పనాయకు డను నాతని తంజావూరురాజ్యమునకు పాలకునిగ పంపెను. (1535) తాళికోట యుద్ధమునందు విజయనగరరాజ్య మోడిపోవువరకును కేంద్రపరిభుత్వము బలవత్తరముగ నుండుటవలన రాజప్రతినిధులు దక్షిణాపథమున సామ్రాజ్యమునకు పర్యవేక్షకులుగ మాత్ర ముండెడివారు. కాని 1565 తరువాత నీ దక్షిణరాజ్యములు పూర్తిగ స్వతంత్రము లయ్యెను. తంజావూరునందలి నాయకరాజు లీ విధముగ స్వతంత్రపరిభువు లయిరి. చెవ్వప్పనాయకుడు 1561 వరకు రాజ్యమేలి ఆపైన సంప్రాప్తయౌవనుడైన తన కుమారు డచ్యుతనాయకుని రాజును గావించి తాను భగవద్ధ్యానమునందును, ఆధ్యాత్మికచింతయందును కాలము పుచ్చెను. చెవ్వప్పనాయకుడు సమర్థుడైన రాజు. ఈతడు తనకు రాజపదము నొసంగిన విజయనగరరాజ్యము నెడ విశ్వాసముతో మెలంగెను. ఈ రాజు వైష్ణవు డయ్యును అన్ని మతములయెడ సమభావముతో వర్తించి వానిని పోషించెను. ఆ కాలమునందు పోర్చుగీసువారు క్రైస్తవమతప్రచారమును దక్షిణాపథమందు కావించుచుండిరి. చెవ్వప్పనాయకునిరాజ్యమునం దీ మతప్రచారమున కెట్టి యభ్యంతరములును కల్పింపబడలేదు. చెవ్వప్పనాయకుడు గోవిందదీక్షితు డను కర్ణాటబ్రాహ్మణవిద్వాంసుని

తన మంత్రిగ నియమించుకొనెను. ఈ గోవిందుడును, ఈతని కుమారులును నాయకరాజులకు మంత్రులుగనుండి రాజ్యమున కెంతయో సేవ గావించిరి. చెవ్వప్పనాయకుడు రాజ్యమునం దా కాలమున విశేషముగ ప్రబలియున్న చోరబాధ నడంగించి శాంతిని నెలకొల్పెను. ఈతని ప్రజ లెట్టి యిబ్బందులును లేక సుఖజీవనము కావించుచుండెడివారని తెలియుచున్నది. ఈతడు ప్రజోపయోగమునకై చెరువులను త్రవ్వించెను. ఈతడు అరుణాచలమునందును, వృద్ధాచలమునందును, అనేక గోపుర ప్రాకారమంటపాదులు నిర్మించెను. చెవ్వప్పనాయకుడు 1580 ప్రాంతమున మరణించినట్లు తెలియుచున్నది.

## అచ్యుతనాయకుడు

చెవ్వప్పనాయకుని జీవితకాలమందే అనగా 1561 వ సంవత్సరమున ఆతని కుమారుడు అచ్యుతనాయకుడు రాజయ్యెను. అచ్యుతనాయకుడు తనతండ్రివలెనే సమర్థుడైనరాజు. ఈతడు తన ప్రజలను చక్కగ పాలించెను. ఈ రాజు కేంద్ర ప్రభుత్వము నెడ విశ్వాసముకలవాడై కేంద్రమునకును మధుర నాయకులకును సంభవించిన యుద్ధములలో తన సామ్రాట్టునకే సహాయము కావించెను. అచ్యుతనాయకుని రాజ్యకాలమునం దలి తుదిభాగములో దేశమునకు పెక్కుయిక్కట్టులు కల్గెను. చోరభయము విశేష మయ్యెను. పోర్చుగీసువారు తమ యధికారమును పెంపొందించుకొనవలయునను నుద్దేశముతో రాజ్యమునకు బద్ధశత్రువులైరి. కేంద్రప్రభుత్వమును జగ్గరాజను

నొక కూరిరు డాక్రమింపగా రామదేవరాయుడను రాజకుమారుడు యాచమనాయకు డను సేనాని సహాయముతో తంజావూరురాజుల యండజేరెను. జగ్గరా జిందుల కాగ్రహపడి తంజావూరురాజ్యముపై దండెత్తుటకు సంసిద్ధుడై యుండెను. ఈ కష్టపరంపరలు వృద్ధుడగు నచ్యుతనాయకు డెదుర్కొనలేదు. అప్పటికే ఆతని కుమారుడు రఘునాథనాయకుడు ప్రాప్తవయస్కుడై రణరంగమున తన ధైర్యసాహసముల జూపియుండినందున నీ శత్రుబృందముతో పోరాడుబాధ్యత యాతనిపైబడెను. సమర్థుడైన తన కుమారుని పట్టాభిషిక్తుని గావించి (1614) అచ్యుతనాయకుడు తన తండ్రివలెనే ఆధ్యాత్మికచింతయందు కాలము గడపసాగెను. రఘునాథుడు చోరనాయకులను, పోర్చుగీసువారిని, జగ్గరాయలనుకూడ సంపూర్ణముగ నోడించి రాజ్యమున శాంతిని ప్రతిష్ఠించి, ప్రభువగు రామదేవరాయని సింహాసనాసీనుని గావించెను.

## ర ఘు నా థ నా య కు డు.

రఘునాథ నాయకుడు తంజావూరు ఆంధ్ర నాయకులలో నెల్ల శ్రేష్ఠుడగు రాజు. ఈతడు 19 సంవత్సరములు రాజ్యము చేసెను. ఈ రాజు స్వయముగ విద్వాంసుడు. పారిజాతాపహరణమను ప్రబంధము నీతడు వ్రాసినట్లు వాడుక కలదు. కాని ఆ గ్రంథమిప్పు డలభ్యముగ నున్నది. ఈతడు సంస్కృతమున వాల్మీకి చరిత్రమును, భారతరామాయణ సంగ్రహములను వ్రాసెను. ఈతని యాస్థానమునందు మధురవాణీ రామ

భద్రాంబలను కవయిత్రు లుండెడివారు. చేమకూర వేంకటకవి విజయవిలాస మను నుత్తమాంధ్ర ప్రబంధమును రచించి రఘునాధరాయని కంకిత మొనర్చెను. రఘునాధ నాయకుడు బహుభాషా కోవిదుడు. సంగీతమునందు కూడ నీ రాజు కృత పరిశ్రముడు. ఈతనిని విజయనగర సార్వభౌముడగు కృష్ణదేవ రాయనితో పోల్చుట యసమంజసము కానేరదు.

## విజయరాఘవ నాయకుడు.

రఘునాధ నాయకుని యనంతర మాతని కుమారుడు విజయరాఘవ నాయకుడు ప్రభువయ్యెను. ఈత డసమర్థుడు, కూ్రరుడునై ప్రజారంజకముగ పాలనము సేయజాలక పోయెను. తన తండ్రి తాతలవలె గాక యీతడు వైష్ణవ మతమును మాత్రమే పోషించి యితర మతస్థులను బాధించెను. ఈతని కాలమున బిజాపుర గోల్కొండ రాజ్యము లీ తంజావూరు నాక్రమించుటకై యత్నించెను. కాని విజయరాఘవుడు వారికి లంచ మొసంగి తన రాజ్యమును కాపాడుకొనెను. తుట్టతుదకు 1673 వ సంవత్సరమున మధురనాయకు డగు చొక్కనాధుడు తంజావూరుపై దండెత్తి విజయరాఘవు నోడించి తంజావూరు నాక్రమించెను. యుద్ధమునందు విజయరాఘవుడును, ఆతని కుమారుడును మరణించిరి. 1675 ప్రాంతమున విజయరాఘవ నాయకుని మనుమ డగు చెంగమలదాసు తంజావూరు రాజ్యముపై యధికారము నెరపెను. కాని యా ప్రభుత్వము స్వల్పకాలము మాత్రమే సాగెను. సుప్రసిద్ధ మహారాష్ట్ర

ప్రభువగు శివాజీ సోదరుడు వెంకాజీ యీ తంజావూరు రాజ్యము నాక్రమించి యాంధ్రప్రభుత్వము నంత మొందించెను.

## తంజావూరు నాయకులు — ఆంధ్రసంస్కృతి.

ఆంధ్రనాయక రాజుల కాలమందు తెనుగువా రనేకులు సర్వవర్ణముల వారును, దక్షిణ దేశమునకు వలసపోయి యచ్చట శాశ్వత నివాస మేర్పరచుకొనిరి. అట్టివారి వంశస్థులు నేటికిని దక్షిణదేశమున కానవగుచున్నారు. ఈ నాయక రాజుల కాలములో దేశము మొత్తముమీద సుభిక్షముగనే ఉండెనని తెలుపవచ్చును. ఈ నాయక రాజుల కాలమునం దాంధ్రభాషాపోషణము చక్కగ జరిగెను. ఆంధ్రమున మొదటి నాటకము రఘునాథాభ్యుదయ మనునది యీ కాలముననే వెలువడెను. ఈ నాటకమును విజయరాఘవుడును, ఆతని పుత్రుడును రచించినట్లు తెలియుచున్నది. విజయరాఘవుని యాస్థానమందలి కవయిత్రి రంగాజమ్మ యనునామె మన్నారు దాస నాటకమును రచించెను. కాని నేటి నాటకములకును, ఆనాటి నాటకములకును చాల వ్యత్యాసము కలదు. ఈ కాలముననే ఆంధ్రమున ప్రత్యేక వచనకావ్యరచన ప్రారంభ మయ్యెను. పదములు, గీతములును కూడ నిప్పుడే ప్రారంభ మయ్యెను. ఆంధ్రభాషయందు క్షేత్రయ్య పదములు సుప్రసిద్ధ ములు. ఈతడు విజయరాఘవ నాయకునికి సమకాలీనుడు. ఆంధ్రనాయక రాజుల పోషణమున గీర్వాణ, కర్ణాట, ద్రావిడ వాఙ్మయములు కూడ వర్ధిల్లెను. సంగీతముకూడ నీ రాజన్యుల

కాలమున నభివృద్ధి గాంచెను. రఘునాథ నాయకుడు స్వయముగ సంగీతమున బ్రవీణుడై నూతన తాళరాగముల నిర్మించెను. సంగీతసుధ, చతుర్దండిప్రకాశిక యను సంగీత గ్రంథములీ కాలముననే రచింపబడెను. తంజావూరు నాయకుల రాజ్యకాల మాంధ్రచరిత్రమున నొక ప్రకాశవంతమగు ఘట్టము.

## మ ధు ర నా య క రా జ్య ము.

శ్రీకృష్ణ దేవరాయని కాలమున దక్షిణాపథ మందు మరియొక ఆంధ్రనాయక రాజ్యము స్థాపింపబడెను. ఈ నాయకులలో విశ్వనాథ నాయకుడు ప్రథముడు. ఈ విశ్వనాథుడు రాజ్యకార్య నిర్వహణమునకై తన తండ్రియగు నాగమనాయకునితో పోరాడి యాతని నోడించి కృష్ణరాయలకడకు బందీగ కొనివచ్చెను. ఈతనియెడ రాయలు చాల సంతుష్టి చెంది మరి కొంత కాలమునకు మధుర రాజ్యమునకు ప్రభువును గావించెను. ఈతడు 1529 – 1564 వరకు రాజ్యపాలనము కావించెను. ఈతని వంశమువారు 1736 వరకును మధురయందు రాజ్యము గావించిరి. తుదకీ రాజ్యము నార్కాటు నవాబులు జయించిరి. స్థలసంకోచము వలన వీరి చరిత్రమును విపులముగ వ్రాయుట లేదు. మధురనాయకులలో తిరుమల నాయకుడు సర్వశ్రేష్ఠుడు. తాళికోట యుద్ధానంతరము విజయనగర రాజ్యము బలహీనమైనప్పటి నుండియు మధుర నాయకులు స్వతంత్రు లగుటకై అనేక యత్నములు గావించి, పలుమారులు తమ సార్వభౌములతో యుద్ధములు కావించిరి. వీరికిని తంజావూరు

నాయకులకును తరచు వైరభావమే యుండెడిది. మధుర నాయకులు కూడ పెనుగొండ యందలి కేంద్ర ప్రభుత్వమునకు తోడ్పడిన యెడల హిందూరాజ్యములు మహమ్మదీయ ప్రభువులచే యాక్రమింపబడకుండెడివి. కాని వీరి యందంత దూరదృష్టి లేక, తమ ఆంతరంగికవిభేదములలో మహమ్మదీయ రాజుల సహాయమును కోరి, తమ గోయి తామే త్రివ్వుకొనిరి. తంజావూరు నాయకుల వలెనే వీరుకూడ గీర్వాణ, ద్రావిడ, ఆంధ్ర వాఙ్మయముల పోషించిరి.

## క్షేత్రయ్య — త్యాగరాజు.

ఆంధ్రనాయకరాజులలో తుదిరాజైన విజయరాఘవ నాయకుని కొలువుకూటమున సుప్రసిద్ధ గానవిశారదుడైన క్షేత్రయ్య యుండెడివాడు. ఈయన ఉత్కృష్టములగు మువ్వగోపాల పదములను రచించెను. భాషామాధుర్యము, రాగకల్పన మున్నగు వానిలో ఈయన కృతు లత్యద్భుతములైనవి. మహనీయుడైన త్యాగరాజు క్షేత్రయ్యకు శిష్యుడు. ఈయన కూడ తంజావూరు రాష్ట్రమునందే నివసించెను. కాని అప్పటికి ఆంధ్రనాయకుల రాజ్య మంతరించి మహారాష్ట్ర ప్రభువుల యుగము ప్రారంభించెను. త్యాగరాజు మహాభక్తుడు. సంగీతమాయన సొమ్ము. త్యాగరాజ కృతుల యందలి సొంపు, మార్దవమును ఆంధ్రదేశముననే గాక దక్షిణదేశ మందంతటను కూడ ప్రసిద్ధి గాంచినవి.

---

# ఆంధ్రుల చరిత్ర



## పారతంత్ర్యదశ



### మహమ్మదీయరాజుల పాలనలో ఆంధ్రదేశము

విజయనగరసామ్రాజ్యము క్షీణించిన తరువాత మెన్న దగిన మరేరాజ్యమునుగాని ఆంధ్రులు స్థాపింపలేదు. ఇంతటితో వీరి స్వాతంత్ర్యదశ యంతమై పారతంత్ర్యదశ ప్రారంభ మయ్యెను. ఆంధ్రదేశమును పరరాజు లాక్రమించిరి. రాజ మహేంద్రవరమునందలి కొండవీటిరాజ్యము నశించిన వెనుక కృష్ణానది కుత్తరమున నున్న యాంధ్రరాష్ట్ర మంతయు గజ పతుల స్వాధీనమయ్యెను. విజయనగరసామ్రాజ్యముయొక్క అత్యుచ్ఛదశయందుకూడ కృష్ణానదియే వారి రాజ్యమున కుత్తరపుహద్దుగా నుండెడిది. బహమనీరాజ్యము స్థాపింపబడిన వెనుక తొల్లింటి కాకతీయరాజ్యము మహమ్మదీయుల యధీన మయ్యెను. బహామనీరాజ్యమునందు చీలికలు ప్రారంభమైన వెనుక గోలకొండయందు కుతుబ్‌షాహి రాజులు స్వతంత్రు లైరి. వారే యాంధ్రదేశమున కేలి క్రీ1686 నందు గోల

కొండ రాజ్యమును ఔరంగజేబు చక్రవర్తి యాక్రమించువర కును పాలించిరి. ఈ రాజులలో కొంద రాంధ్రభాషను స్వయ ముగ నేర్చి ఆంధ్రభాషను పోషించిరి. మల్కిభరాం అని యాంధ్రకవులచే పేర్కొనబడిన ఇబ్రహీమ్ కుతుబ్‌షా యిట్టి వాడు. ఈతడు విజయనగర ప్రభువగు రామరాజుకడ కొంత కాలము నివసించియుండుటవలన నీతని కాంధ్రభాషయం దభి మాన మేర్పడి యిందు పరిశ్రమచేసెను. పొన్నిగంటి తెలగ నార్యకృతమగు యయాతిచరిత్ర మను నచ్చ తెలుగు ప్రబంధ మును అమీన్‌ఖానను ఒక సర్దారును, అద్దంకి గంగాధరకవి కృతమగు తపతీసంవరణోపాఖ్యానమును ఇబ్రహీం పాదుషా యును కృతిపొందిరి. గోలకొండనవాబులు మతసహనబుద్ధితో ప్రవర్తించి, పలువురు హిందువులను తమ క్రింద నుద్యోగులుగ నియమించుకొనెడివారు. ఇట్టివారిలో అక్కన్న మాదన్నగార్లు మిక్కిలి ప్రఖ్యాతిగాంచిరి. వీ రాంధ్రనియోగిబ్రాహ్మణులు. ఇంటిపేరు పింగళివారు. వీరి వంశస్థులు నేటికిని హైద్రాబాదు రాష్ట్రమునందు గలరు. ఈ అక్కన్న మాదన్నగార్లు తుది గోల్కొండనవాబగు అబుల్ హసన్ కుతుబ్‌షా వద్ద మంత్రి త్వము వహించి మిక్కిలి ఖ్యాతి గడించిరి. వీరు తమ బుద్ధిబల ముచే గోల్కొండరాజ్యమును మిక్కిలి వర్ధిల్ల జేసిరి. ఈ మం త్రులు జీవించియున్నంతకాలమును గోల్కొండరాజ్యము తనకు వశము కాకుండుటచే ఔరంగజేబు చక్రవర్తి వీరిని మాయో పాయముచే చంపించెనని చరిత్రలు తెల్పుచున్నవి. అక్కన్న

మాదన్నగార్ల మేనల్లుడగు కంచర్ల గోపన్నను గురించి యెరుంగని ఆంధ్రుడుండజాలడు. ఈ మహనీయుడు భద్రాచలమునందు శ్రీరాముని కొరకు ప్రసిద్ధదేవాలయము కట్టించెను. ఈ భక్తాగ్రేసరునికి రామదాసను సార్థకనామము కల్గెను. ఈ పేరుతోడనే యీ మహనీయుడు మనకందరకును తెలిసియున్నాడు. గోల్కొండరాజ్యము నశించిన వెనుక ఆంధ్రభూభాగమంతయు మొగలుసామ్రాజ్యములో లీనమైపోయెను. కాని మొగలుసామ్రాజ్యముకూడ అచిరకాలములోనే క్షీణింపసాగెను. ఢిల్లీశ్వరుడగు ఔరంగజేబు చక్రవర్తి 1707 లో మరణించిన వెనుక యాతని వంశమునందు సమర్థులగు రాజు లెవ్వరును జన్మించలేదు. అందువలన మొగలుసామ్రాజ్య మందలి వివిధ ప్రాంతములలో వివిధనాయకులు స్వతంత్రులై ప్రత్యేకరాష్ట్రముల స్థాపించిరి. దక్షిణదేశమునకు సుబేదారుగనున్న ఆసఫ్ జా యను నాతడు 1724 నందు స్వాతంత్ర్యమును ప్రకటించి, నేటి హైదాబాదురాష్ట్రమునకు స్థాపకు డయ్యెను. ఈ హైద్రాబాదురాజ్యము పూర్వపు గోలకొండరాజ్యమునకు ప్రతిబింబ మని తెలుపవచ్చును. ఆంధ్రదేశమునందు చాల భాగము హైద్రాబాదురాష్ట్రములోనే యుండెను. ఔరంగజేబు చక్రవర్తి యనంతరము దేశమందు ప్రబలిన యరాజకత్వమాంధ్రదేశమందుకూడ చూపట్టెను. దారిదోపిడి దొంగలు ప్రబలులై దేశమునంతను అల్లకల్లోలము గావించిరి. ఆసఫ్ జా రాజు దొంగల నణచివైచి దేశమునందు కొంతవరకు శాంతి

స్థాపనము కావించెను. ఆయన భూమిపన్నులను వసూలుచేయుటకై దేశముఖులు, దేశపాండ్యాలు మున్నగువారిని నియమించెను. వీరు భూమిపన్నును వసూలు చేసి అందులో కొంత భాగము ప్రభుత్వమువారి కొసంగి, మిగిలినది తామే యనుభవించుచుండిరి. ఈ విధముగనే మన దేశమందలి ప్రస్తుత జమీందారులు బయలుదేరిరి.

## ఆంధ్రదేశమున పాశ్చాత్యుల ప్రవేశము

పదునేనిమిదవ శతాబ్దియందు పాశ్చాత్యులు ప్రబలురై హిందూదేశమున రాజ్యమును సంపాదించుటకై పెనగులాడుట ప్రారంభించిరి. 1639 వ సంవత్సరమునందే ఆంగ్లేయులు మద్రాసులో కోట కట్టుకొనుటకు విజయనగర రాజవంశములోని శ్రీరంగరాయల వద్ద యనుమతిని పొందిరి. అప్పటికీ రాజులు చంద్రగిరియందు రాజ్యము చేయుచుండిరి. ఆంగ్లేయులు తమ బుద్ధికుశలతచేతను, సామర్థ్యముచేతను తమ స్థితిగతుల నభివృద్ధి కావించుకొని బాగుపడిరి. వీరు గోలకొండ రాజ్యమువారి యనుగ్రహమును సంపాదించి తమ వ్యాపారమును సంరక్షించుకొనుచుండిరి. ఇదే సమయమున ఫ్రాన్సు దేశమువారుకూడ హిందూదేశముతో వర్తకవ్యాపారములు చేసి ధనము సంపాదించుటకై యొక కంపెనీని స్థాపించిరి. కాని హిందూదేశమునందు బలవత్తరమగు కేంద్రప్రభుత్వము లేనందువలన దేశమున నరాజకత్వము, అల్లకల్లోలములు ప్రబలియుండినందున, వీరికి తామే యీ దేశమును జయించి

పాలనము చేయవలెనను కోరిక కల్గెను. వీరు హిందూదేశపు సిపాయిలకు జీత మిచ్చి తమ సైన్యములలో జేర్చుకొని వారికి చక్కని సైన్యశిక్షణ యొసంగసాగిరి. ఇయ్యది వారిసామ్రాజ్య నిర్మాణమునకు ప్రథమసోపానము. దేశీయరాజుల యన్యోన్య కలహములలో తాము జోక్యము కల్పించుకొని, ఆ విధముగ పలుకుబడిని, అధికారమును సంపాదించుట రెండవ దశ. పై యంశముల నాచరణయం దిడుటలో ఫ్రెంచివారు ముందంజ వేసిరి. 1748 వ సంవత్సరమున నిజాముల్ ముల్కు ఆసఫ్‌జా చనిపోయినప్పుడు హైద్రాబాదురాజ్యమున సంభవించిన యంతఃకలహములలో ఫ్రెంచిగవర్న రగు డూప్లే జోక్యము కల్పించుకొని తన కిష్టుడగు ముజఫర్‌జంగును, ఆతని యనంతరము సలాబత్‌జంగు అను నాతనిని నిజాముగ కావించెను. ఈ వ్యవహారములో ఫ్రెంచి సేనానాయకుడగు బుస్సీ ముఖ్యపాత్రను ధరించెను. ఈ కాలమునాటికే ఫ్రెంచివారు మచిలీపట్టణములో కోట కట్టుకొని స్థిరపడియుండిరి. ఫ్రెంచివారు తమకు కావించిన సహాయమునకై సంతోషించి ముజఫర్, సలాబతుజంగులు వీరికి ఉత్తరసర్కారులను ప్రాంతములను అనగా విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలను పరాసుసైన్యములకు భరణముగా నొసంగెను. ఫ్రెంచివారి యధికారము ప్రబలమగుచుండుట ఇంగ్లీషువారికి కన్నెఱ్ఱగా నుండెను. వారు పరాసువారి నెట్లైన పడగొట్టవలెనని పథకము వేయుచుండిరి.

## ఆంధ్రదేశము క్రమముగ ఆంగ్లేయులకు వశపడుట.

1756 వ సంవత్సరమున యూరపు ఖండమునందు సప్త సంవత్సర యుద్ధము ప్రారంభమైనప్పు డాంగ్లేయులకు పరాసు వారిని పరాభవించుట కవకాశము లభించెను. 1757 వ సంవత్సరమున ప్లాసీ యుద్ధమున విజయమును పొందిన వెనుక ఆంగ్లేయులు కల్నల్ ఫోర్డు అను నాతనిని 500 యూరోపియనులు, 2000 సిపాయీలును, గల సైన్యముతో దక్షిణాపథమునకు బంపిరి. విజయనగరమునకు రాజైన ఆనందగజపతి మహారాజు ఆంగ్లేయ పక్షపాతియై వారి పక్షము నవలంబించెను. ఫోర్డు పరాసు సైన్యములను రాజమహేంద్రవరమునకు సమీపమున నున్న కొండూరువద్ద నోడించెను. కల్నల్ ఫోర్డు మచిలీపట్టణము పై దాడివెడలి మిక్కిలి కష్టముతో దానిని సాధింపగలైను. ఆనంద గజపతి సహాయ మాంగ్లేయుల విజయమునకు చాల వరకు కారణభూత మయ్యెను. 1763 నాటికి దక్షిణదేశమున పరాసువారి బలము పూర్తిగ క్షీణించెను. ఇంతవరకు ఫ్రెంచి వారి పక్షము నవలంబించి యున్న సలాబతుజంగు, వారిని విడనాడి ఆంగ్లేయులతో స్నేహము చేయసాగెను. ఇదివరలో ఫ్రెంచివారి కొసంగబడిన ఉత్తర సర్కారు లాంగ్లేయుల యధీనము లోనికి వచ్చెను. 1799 వ సంవత్సరమున వెల్లస్లీ ప్రభువు సైన్య సహాయ విధానము (Subsidiary System) నేర్పాటుచేసి దేశీయ ప్రభువుల నెల్లర నీ విధాన మంగీకరింప

వలసినదని ప్రోత్సహించెను. ఆ కాలమున నిజాము రాజ్యముపై మహారాష్ట్రులు తరచుగా దాడి వెడలుచు, ఆతనికి చాల చిక్కులు కల్గించు చుండిరి. మహారాష్ట్రుల బాధ పడలేక నిజాము సైన్యసహాయ పద్ధతి నంగీకరించి తన రాజ్యమున నుండు బ్రిటీషుసేనల కగు ఖర్చులకుగాను కడప, కర్నూలు, అనంతపురము, బళ్ళారి జిల్లాలను బ్రిటీషువారి కొసంగెను. 1798 వ సంవత్సరమున వెల్లస్లీ ప్రభువు కర్ణాటక నవాబు నధికారమునుండి తొలగించి యీతని రాజ్యమును బ్రిటీషువారి పాలనము లోనికి గొనివచ్చెను. ఆ సందర్భమున మరికొన్ని ఆంధ్ర ప్రాంతము లాంగ్లేయుల రాజ్యములో చేరెను. ఈ విధముగ నాంధ్రప్రజలు బ్రిటీషువారి యధికారమునకు లోబడిరి. ఒకానొక కాలమున మహోన్నతస్థితియం దున్న యాంధ్రులు నోరులేని జంతువులవలె నొక ప్రభుత్వము నుండి వేరొక ప్రభుత్వమువారి యధికారము లోనికి పోవుచుండుట వారి దైన్యతకు తార్కాణమని మాత్రము మనము గ్రహింపవలెను.

## ఆంధ్రదేశమందలి వీరకుటుంబములు.

ఆంగ్లేయులును, ఫ్రెంచి వారును భారతదేశమున సామ్రాజ్య స్థాపనమునకై యొండొరులతో పోరాడుచున్న కాలములో కూడ మన దేశమున ధైర్యసాహసములు, యుద్ధ కౌశల్యము మున్నగునవి పూర్తిగ నశింపలేదు. ఉదాహరణము

నకు బొబ్బిలి, విజయనగర సంస్థానములను పేర్కొనవచ్చును. బొబ్బిలి సంస్థానమందు వెలమవారును, విజయనగరమందు క్షత్రియులును పాలించుచుండిరి. ఈ రెండు రాజ్యములవారి శౌర్య పరాక్రమములు బొబ్బిలి యుద్ధమందు ప్రకటితమై యాంధ్ర దేశీయులచే నేటికిని స్మరింపబడుచున్నవి. అట్లే పెద్దా పురమందు వత్సవాయి వారను క్షత్రియులు ప్రసిద్ధి గాంచిరి. కాని వీరెల్లరును దూరదృష్టి లేక అన్యోన్య కలహములతో పొద్దులు పుచ్చుచున్నందు వలన దేశము సులభముగ పరాధీన మగుట కవకాశము లేర్పడెను.

## ఆంధ్రదేశము విభజనకు లోనగుట.

1799 వ సంవత్సరమున టిప్పు సుల్తాను మరణించిన వెనుక తొల్లింటి ఒడయరు వంశస్థులలో నొకరిని వెల్లస్లీ ప్రభువు మైసూరు రాజుగ నియమించెను. టిప్పుసుల్తాను పాలించిన రాజ్యములో సగము భాగముమాత్ర మీ నూతన రాజ్యములో నుండెను. అందు కొన్ని తెలుగుజిల్లాలు కలవు. ఈ విధముగ నాంధ్రదేశము మూడు భాగములుగ విడిపోయి కొంత భాగము బ్రిటీషు పాలనలోను, మరికొన్ని ప్రాంతములు నైజాము, మైసూరు రాష్ట్రములలోను చేరుట తటస్థించెను.



# ఆంధ్రుల చరిత్ర



## ఆ ధు ని క యు గ ము



చరిత్రాంతర్గతమైన యాంధ్రుల చరిత్ర యింతటితో ముగిసినది. ఆధునిక యుగమునం దాంధ్రజాతి యెట్టి స్థితియం దున్నదో, వారి రాజకీయ, సాంఘిక, ఆర్థిక, నైతిక, వైజ్ఞానికాభివృద్ధి మున్నగునవి యెంతవరకు సాగినవో సూక్ష్మముగ తెల్పుట యీ క్రింది పుటల యుద్దేశ్యము.

### ఆంధ్రదేశచరిత్రలో నూతనయుగము.

భారతదేశము బ్రిటీషువారి పరిపాలనలోనికి వచ్చిన తరువాత కొంతకాలము వరకును, ఇచ్చటి ప్రజలు నిద్రావస్థయందే ఉండిరని తెలుపవచ్చును. పాశ్చాత్య విద్యాస్వీకరణము వలనను, పాశ్చాత్య భావ సంపర్కము వలనను, ఈ దేశము నందు భావసంచలనము కల్గెను. ప్రాచీన భారతీయ సంప్రదాయానుగుణ్యములగు భావములలో మార్పు గల్గి భారతీయ ప్రజానీకమందు నూతనభావము, నూతనకాంక్షలు, నూతనావేశములును కలుగ జొచ్చెను. ఈ భావసంచలనము, మత, సామాజిక, రాజకీయ ప్రపంచములందు ప్రతిఫలించి వివిధ

పరిణామముల గల్గించెను. బ్రహ్మసమాజ మతస్థాపనము, సహగమన పద్ధతి నిరోధము, బాల్య వివాహ నిరసనము, స్త్రీపునర్వివాహోద్యమము, జాతీయ మహాసభా స్థాపనము మున్నగునవి పైన పేర్కొనబడిన భావసంచలనము యొక్క ఫలితములే కాని వేరొండు కావు. ఇరువదవ శతాబ్ది యారంభమునందు జాతీయభావము సమస్త భారతదేశమునందు వలెనే ఆంధ్రదేశమున కూడ వ్యాపించి, నూతనోద్యమముల స్థాపనకు కారణభూత మయ్యెను. బ్రిటీషు సామ్రాజ్యము స్థిరముగ స్థాపితమైన తరువాత ప్రజలు నిరాయుధులు కావింపబడుట వలనను, స్థానిక స్వాతంత్ర్యము కూడ బొత్తుగ లేకపోవుట వలనను, ఆంధ్రదేశీయులలో సహజముగ నుండెడి ధైర్యశౌర్యములకును, యుద్ధకౌశల్యమునకును తావు లేకుండ పోయెను. భారతదేశమున నేడుకూడ రాజకీయరంగమునందు యుద్ధములు సాగుచునే యున్నవి. కాని అవి దౌర్జన్యరహితములు. అందు యోధుడు ఇతరుల ప్రాణముల గొనడు. తన ప్రాణముల నుపహారముగ సమర్పించును. అట్టి రణముల యందు కూడ ఆంధ్రవీరుడు ముందంజయే వేయుచున్నాడు.

## యుగపురుషుడు వీరేశలింగముపంతులు

ఆంధ్రదేశమున నూతనయుగము మతసాంఘిక నైతిక సంస్కారములతో నారంభించెను. ఈ యుగకర్త కీర్తిశేషులైన రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగం పంతులు. ఈయన

తన పత్రికాముఖమునను, గ్రంథరచనలచేతను, ఉపన్యాసముల చేతను ఆంధ్రదేశమున నైతిక ధార్మిక ప్రబోధము కల్గించెను. సంఘమునందలి యవినీతిని దురాచారములను మోమోడక ఖండించి ప్రజలను నీతివంతులను కావించుటకై చాల పాటు పడెను. వితంతువివాహోద్యమము నాంధ్రదేశమున స్థాపించి స్త్రీజాతికి గొప్పసేవ గావించెను. రాజారామమోహనరాయల వారిచే స్థాపింపబడిన బ్రహ్మసమాజమతము నాంధ్రదేశమున ప్రచారము కావించినది శ్రీ పంతులుగారే. కీర్తిశేషులైన రఘుపతి వేంకటరత్నము నాయుడుగారు, చిలకమర్తి లక్ష్మీ నరసింహకవిగారు మున్నగువారు వీరేశలింగముగారి మార్గ మునే అవలంబించి యాంధ్రదేశమున గొప్పప్రబోధమును కల్గించిరి.

## ఆంధ్రులు - కాంగ్రెసు సంస్థ

1885 వ సంవత్సరమున అఖిల భారత జాతీయ మహా సభ (కాంగ్రెస్) స్థాపింపబడెను. మొదటనుండియునుకూడ ఆంధ్రు లీ సంస్థతో సంబంధము కలవారై తత్కార్యక్రమము నం దుత్సాహముతో పాల్గొనిరి. 1891 వ సంవత్సరమునందు ఆనందాచార్యులుగారనే ఆంధ్రప్రముఖులు నాగపురమునందు జరిగిన కాంగ్రెస్ మహాసభ కధ్యక్షత వహించిరి. న్యాపతి సుబ్బారావుపంతులుగారు కాంగ్రెసుసభకు మూడుసంవత్సర ములకు పైబడి కార్యదర్శులుగ నుండిరి. కాని 1917 వ సంవ

త్సరము వరకు ఆంధ్రప్రాంతములకు కాంగ్రెసులో ప్రత్యేక వ్యక్తిత్వము లేకుండెను. ఆ సంవత్సర మాంధ్రప్రాంతము ప్రత్యేక రాష్ట్రముగ పరిగణింపబడి నప్పటినుండియు, కాంగ్రెసు నందు తెనుగువారికి ప్రత్యేకత యేర్పడెను. గత ముప్పదియైదు సంవత్సరములయందును గాంధీమహాత్ముని యాజమాన్యమున కాంగ్రెసుసభలో యెన్నియో మార్పులు, యెంతయో జాతీయ ప్రబోధము, యెన్నియో స్వాతంత్ర్యసమరములు జరిగినవి. ఈ యన్నింటియందును ఆంధ్రులు మహత్తరమైన యుత్సాహము తోడను, ధైర్యసాహసములతోడను పాల్గొనిరి. నేటికాంగ్రెసు ఆంధ్రనాయకులలో డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు, కొండా వెంకటప్పయ్య పంతులుగారు, బులుసు సాంబమూర్తి గారు, టంగుటూరి ప్రకాశం పంతులుగారు మున్నగువారు ప్రముఖులు.

## ప్రత్యేకాంధ్రరాష్ట్రోద్యమము

ఇరువదవ శతాబ్దియందు ఆంధ్రదేశమున ప్రారంభమైన యుద్యమములలో ఆంధ్రరాష్ట్రసంపాదనాప్రయత్నము ముఖ్యముగ పేర్కొనదగినది. ఈ యుద్యమము జాతీయభావవ్యాప్తి వలన తలయెత్తినది. నేడు భారతీయప్రజానీకమును ప్రోత్సహించుచున్న యితరభావములవలెనే జాతీయభావముకూడ పాశ్చాత్యసంస్కారమువలన జనించినదే. అఖండమైన యొక్క భూభాగమునందు నివసించుచు, ఒకేభాష మాట్లాడుచు, ఒకే

విధమగు సంస్కృతి, పూర్వచరిత్రము కలవా రెల్లరును ఒక ప్రత్యేకజాతికి చెందినవారను భావము మొదట పాశ్చాత్యదేశములయందే జనించి క్రమముగ భారతదేశమునకుకూడ ప్రాకినది. దీనికితోడు 1905 వ సంవత్సరమున అప్పుడు రాజప్రతినిధిగానున్న కర్జనుప్రభువు వంగదేశవిభజనము కావించినప్పుడు వంగీయులు మహత్తరమైన యాందోళనము ప్రారంభించి, వంగప్రజ లొకజాతికి చెందినవారనియు, అందువలన నాజాతిని విభజించుట గొప్పఅన్యాయమనియు వాదించిరి. ఈ యుద్యమమునే "వందే మాతరం" ఉద్యమమని సామాన్యప్రజలు వాడుచున్నారు. ఈ యుద్యమమున కుపాంగములుగ స్వదేశవస్తునిర్మాణము, విదేశవస్తుబహిష్కారము మున్నగునవి ప్రారంభమయ్యెను. ప్రజానీకమునందుకల్గిన తీవ్రసంచలమును గుర్తించి బ్రిటిషుప్రభుత్వమువారు వంగదేశ విభజనను మార్పుగావించి వంగీయులెల్లరు నొకేరాష్ట్రమునందుండున ట్లేర్పాటుచేసిరి. ఈ సందర్భమున అప్పటి రాజప్రతినిధియగు హార్డింజిప్రభువుకూడ జాతీయభావమును సమర్థించుచు తదనుగుణ్యముగ రాష్ట్రనిర్మాణము కావింపవలెనని సూచన కావించెను. పైన వర్ణింపబడిన పరిస్థితులవలన నాంధ్రదేశీయులలోకూడ ప్రత్యేకరాష్ట్రనిర్మాణము కావలెనను యుద్దేశ్య మంకురించెను. ఇందులకు ఫలితముగ 1913 వ సంవత్సరమున ప్రథమాంధ్రమహాసభ సమావేశ మయ్యెను. ఆ మరుసటిసంవత్సరము ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమును కావింపవలె నను తీర్మానమును ఆంధ్ర

మహాసభవా రేకగ్రీవముగ నంగీకరించిరి. అట్టి తీర్మానము కావింపబడి నలుబదిసంవత్సరములు గడచినవి. ఈ మధ్యకాలములో ఆంధ్రమహాసభ అనేకపర్యాయములు సమావేశమై యీ తీర్మానమును మరలమరల బలపరచెను. దీని విషయమై ప్రచారముకూడ చాలజరిగెను. ఆంధ్రప్రముఖులలో పలువురు సర్ బయ్యా నరసింహేశ్వరశర్మగారు, న్యాపతి సుబ్బారావు పంతులుగారు, సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు, పానగల్లు రాజావారు, సర్ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు, సర్ విజయానంద గజపతివారు, సర్ మోచర్ల రామచంద్రరావుగారు, కాశీనాథుని నాగేశ్వరరావుగారు మున్నగువారీయాంధ్ర మహాసభల కాధిపత్యము వహించి ఆంధ్రోద్యమమునకు బలమును చేకూర్చిరి. ఇటీవల కాంగ్రెసుపక్షమువారు మంత్రిత్వపదవులను నలంకరించిన సందర్భమున మద్రాసుశాసనసభవారు ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణము నంగీకరించుచు తీర్మానము కావించిరి. కాని లండనునందలి సార్వభౌమికప్రభుత్వమువారీ ప్రతిపాదనను త్రోసిపుచ్చిరి. ఆంధ్రులు తీవ్రజాతీయవాదులగుటయే దీనికి కారణమైయుండనోపును. ఆర్థికముగను, రాజకీయముగను, ప్రత్యేకరాష్ట్రముగనుండుట కష్టమైన యీ ప్రాంతమువారి న్యాయమగు కోర్కెలను ప్రభుత్వమువారు నిరాకరించుటకు వేరొండుకారణము కానరాదు. కాని ప్రజాభిప్రాయము ప్రత్యేకాంధ్రరాష్ట్రముకొరకై చాల తీవ్రపడుచున్నది. కావున నేడో రేపో వారికోర్కెలు సిద్ధింపకమానవు.

పైన వర్ణింపబడిన ఆంధ్రోద్యమము బ్రిటిషువారి పరిపాలనలో నున్న జిల్లాలనుమాత్రమే వర్తించుచున్నది. నైజాము, మైసూరు రాజ్యములందుకూడ ఆంధ్రప్రజ లధికసంఖ్యాకులుగ నున్నారు. రాజకీయకారణములవలన వారీ యుద్యమమునందు పాల్గొనజాలకపోయినను, వారికి ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమునెడ సంపూర్ణముగు సానుభూతి కలదనుటలో సందేహ మెంతమాత్రమును లేదు.

## ఆంధ్రదేశము - ఆర్థికపారిశ్రామికాభివృద్ధి.

ఆధునిక యుగమున ప్రజాభిప్రాయ ప్రకటనమున కెన్నిమార్గములు కలవో, అట్టి యుద్యమములన్నియు ఆంధ్రదేశమున ప్రచారములో నున్నవి. కాంగ్రెసు మహాసభకు సహాయకములుగనున్న ఖద్దరు ప్రచారము, గ్రామపరిశ్రమల వ్యాప్తి, నిమ్నజాత్యుద్ధరణము, హిందీభాషా ప్రచారము మున్నగు నుద్యమముల నాంధ్రు లుత్సాహముతో నడపుచున్నారు. ఇవికాక రైతు ఉద్యమము, కార్మికోద్యమము, స్త్రీ ఉద్యమము మున్నగు నుద్యమములద్వారా ఆంధ్రదేశమున గొప్పప్రచారము జరుగుచున్నది. రైతు ఉద్యమమునందు ఆచార్య రంగాగారును, కార్మికోద్యమమునందు వి. వి. గిరి గారును ప్రముఖనాయకులుగ నున్నారు. అర్థసంపాదనమునందును, పారిశ్రామికాభివృద్ధియందునుకూడ ఆంధ్రదేశము నేడు కొంతవరకు ముందంజ వేయుచున్నది. రాజకీయకారణముల

వలన మనదేశమునందలి పరిశ్రమలు క్షీణించినవి. కాని 1905 వ సంవత్సరము నాటి జాతీయోద్యమముతో దేశీయ పారిశ్రామికాభివృద్ధికి చాలవరకు దోహదము కల్గినది. అట్లే 1920 వ సంవత్సరమునుండి ప్రారంభమైన యుగమునుండి ఖద్దరువ్యాప్తియు, తదితర పరిశ్రమలును అభివృద్ధిచెందుట సంభవించినది. ఆంధ్రదేశములో వివిధ జిల్లాలయందు, కృష్ణ, గుంటూరుజిల్లాలయందును, రాయలసీమయందును ప్రత్తిపండును. ఇచ్చటనూలుతీయు మరలు కొన్నికలవు. తూర్పుగోదావరిజిల్లా పందలపాకయందు బట్టలునేయు మిల్లులుకూడకలవు. హైదరాబాదురాష్ట్రమునందు ఓరుగల్లు, హైదరాబాదునగరములలో బట్టల గిర్నీలు చక్కగ పనిచేయుచున్నవి. చేతినేతయందు తెలుగువారి సామర్థ్యము ప్రశంసింపదగినది. ఖద్దరువ్యాప్తి యాంధ్రదేశమున బాగుగా జరిగినది. పట్టుబట్టలు వగైరాలు నేయుటలోకూడ ఆంధ్రదేశీయులు మంచి నేర్పుగల్గియున్నారు. బరంపురము, హైదాబ్రాదురాష్ట్రములోని ఓరుగల్లు, సిద్ధిపేట మున్నగు ప్రాంతములలో మంచి పట్టుబట్టలు నేటికిని తయారగుచున్నవి. గోగునార, జనపనార మున్నగునవి తెలుగుప్రాంతములో ఉత్పత్తియగును. గుంటూరు, ఏలూరులందు గోనెసంచులను తయారుచేయు మిల్లులు కలవు. ఇవికాక విదేశీయులచే నడుపబడుచున్న మిల్లులు నెల్లిమర్ల, చిట్టివలస అను ప్రదేశములలో కలవు. ఆంధ్రదేశములో ఇటీవల పంచదార తయారుచేయు ఫ్యాక్టరీలు స్థాపితమైనవి.

చామర్లకోట, వుయ్యూరు, సీతానగరము, కిర్లంపూడి, బొబ్బిలి, పిఠాపురము మున్నగు ప్రదేశములందును, హైదరాబాదురాష్ట్రమునందు బోధన్ నందును పంచదార తయారు చేయబడుచున్నది. రాజమహేంద్రవరమునందు కాగితములు తయారుచేయు మిల్లులు స్థాపింపబడినవి. కాని అవి బాగుగా పనిచేయకపోవుట శోచనీయము. హైదరాబాదురాష్ట్రమునందు సిరిపూరు అను ప్రదేశమునందు నైజాముప్రభుత్వము మంచికాగితములను తయారుచేయించుచున్నది. బెజవాడ, తాడేపల్లి యందు సిమెంటు కర్మాగారములు స్థాపింపబడినవి. బందరునందు సైంటిఫిక్ కంపెనీ స్థాపింపబడి దినదినాభివృద్ధి చెందుచున్నది. వివిధములగు చేతిపరిశ్రమలు, అద్దకము, తివాచీలు, జంబుకానాలు నేయుట, బొమ్మలు తయారుచేయుట మున్నగునవి ఆంధ్రదేశమున వ్యాప్తియందున్నవి. ఆంధ్ర ఇంజనీరింగు కంపెనీ, ఆంధ్ర చేంబర్ ఆఫ్ కామర్స్ అను సంస్థల వలననూ, ఆంధ్ర, భారతలక్ష్మి మున్నగు బ్యాంకులవలనను, ఆంధ్ర, హిందూస్థాన్ మ్యూచుయల్ మున్నగు భీమాకంపెనీల వలనను తెనుగుదేశీయుల ఆర్థికాభివృద్ధి తెలిసికొనవచ్చును. సహకారోద్యమముకూడ ఆంధ్రప్రాంతములో వ్యాప్తి చెందినది. ఆంధ్రప్రాంతమున భీమాకంపెనీలు, బ్యాంకులు స్థాపించుటయందు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారును, సహకారోద్యమవ్యాప్తికై వేమవరపు రామదాసుపంతులుగారు కారణభూతులైరని తెలుపవలసియున్నది.

## విద్యాభివృద్ధి.

ఈ నవీనయుగము నందు ఆంధ్రదేశమున విద్యాభివృద్ధి కొంతవరకు జరిగినది కాని నేటికిని అక్షరాస్యులు నూటికి పది మందికి లోబడి యున్నారు. ఉన్నత విద్యావ్యాప్తికై ఇటీవల కావింపబడిన యత్నములలో ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపనము ప్రత్యేకముగ తెలుపదగి యున్నది. ఈ విశ్వవిద్యాలయము 1926 వ సంవత్సరమున నెలకొల్పబడెను. సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారును, సర్ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారును ఈ విశ్వవిద్యాలయమున కుపాధ్యక్షులుగ నుండి యెంతయో సేవ గావించి యున్నారు. ఈ విశ్వవిద్యాలయము భౌతిక శాస్త్ర బోధనము నెడ ప్రత్యేకము శ్రద్ధవహించు చున్నది. ఆంధ్రభాషలో ఉన్నత విద్యను గరుపవలసిన బాధ్యత యీ విశ్వవిద్యాలయముపై నున్నది. అతి ముఖ్యమగు నీ సంస్కరణమును విశ్వవిద్యాలయాధికారు లచిరకాలములోనే కావింతురని యందరును కోరుచున్నారు. ధనాఢ్యులైన జమీందారు లాంధ్రదేశమున వివిధ ప్రాంతములలో కళాశాలలను స్థాపించి విద్యాభివృద్ధికై పాటుపడు చున్నారు. విజయనగరము మహారాజావారు, పిఠాపురము రాజావారు, వుయ్యూరు రాజావారు, వెంకటగిరి రాజావారు మున్నగు వారీ సందర్భమున ప్రశంసాపాత్రులు.

## ఆంధ్రభాషాభివృద్ధి.

ఆధునిక యుగమం దాంధ్రదేశమున భాషాబివృద్ధి కూడ చక్కగ జరిగినదనియే తెలుపవచ్చును. ఆంధ్ర ప్రబోధ మునకు కారణభూతులైన కందుకూరి వీరేశలింగం పంతులు గారు ఆంధ్రభాషను నవీనమార్గముల లోనికి త్రిప్పినారు. ఈ మహనీయుడు పూర్వసంప్రదాయము ననుసరించి పాండిత్యము సంపాదించి రసికజనమనోరంజనము మున్నగు ప్రబంధములను రచించెను. కాని రానురాను వారి అభిప్రాయములు మారి, కేవల వచనరచనయందే తమ శక్తి నంతయును వినియోగించిరి. ఈయనకు గద్యతిక్కన యను సార్ధకనామము కలదు. వీరేశలింగముగారు సంస్కృత భాషనుండి శాకుంతలాది నాటకముల ననువాదము చేసియున్నారు. ఇవికాక ఆంధ్ర భాష యందు మొదటి నవల, మొదటి శాస్త్రీయగ్రంథము, మొదటి కవుల చరిత్ర, మొదటి ప్రహసనము రచించినది వీరే. పంతులు గారి ప్రతిభ సర్వతోముఖమైనది. ఈయన శతాధిక గ్రంథ ముల రచించి ఆంధ్ర భాషయందు క్రొత్తపోకడలను కల్పించి యున్నారు. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు వీరేశలింగము గారి శిష్యకోటిలోని వారు. పంతులుగారి వలెనే వీరు కూడ వివిధగ్రంథముల రచించి భాషాసేవ చేసియున్నారు. స్వతంత్ర రచనాపద్ధతులపై గ్రంథరచనము చేసిన వారిలో పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు ఎన్నదగి యున్నారు. వీరిచే రచింప

బడిన 'సాక్షి' యను గ్రంథము తెలుగుభాషలో నపూర్వమైనది. ఇందు పానుగంటివారి సామర్థ్యము బాగుగా ప్రకటితమై యున్నది. నాటక రచనము నందు కీ. శే. ధర్మవరము కృష్ణమాచార్యులుగారు ప్రత్యేకముగ పేర్కొనదగినవారు. వీరు పెక్కు నాటకములను రచించి భాషాసేవ గావించి యున్నారు. చారిత్రక పరిశోధనకును, చరిత్ర గ్రంథరచనము నకును చాల దోహద మొసంగి స్వయముగ హిందూదేశ చరిత్రను రచించి ఖ్యాతిగాంచిన కీ. శే. కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గారీ కాలపు ఆంధ్ర రచయితలలో నున్నత స్థానము నలంకరించుచున్నారు. వీరు ఆంధ్రమునందు విజ్ఞానసర్వస్వమును ప్రారంభించి అందు కొంత భాగమును మాత్రము పూర్తిచేసి దివంగతులైరి. వీరుకాక పండితకవులైనవారు పలువు రాంధ్రదేశమున కీర్తి ప్రతిష్ఠల నార్జించి యున్నారు. వీరిలో తిరుపతి వేంకట కవులు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి మున్నగువారు తమ గ్రంథములచే ఆంధ్రభాషకు నూత్నశోభ కల్పించి యున్నారు.

## ఆంధ్రభాషలో క్రొత్తపోకడలు.

ఇరువదవ శతాబ్దియం దాంధ్రమున క్రొత్త రీతుల కావ్య రచనము కావించు పద్ధతి చాల ప్రచారము చెందినది. దీనికి మూలపురుషు లనదగినవారు గురజాడ అప్పారావు పంతులుగారు. వీరు తాము రచించిన కన్యాశుల్క నాటకమున

వ్యావహారిక భాషను విరివిగ వాడి ఒక నూతన పద్ధతిని నెల కొల్పిరి. అప్పారావుగారు ప్రారంభించిన వ్యావహారిక భాషా ప్రయోగము నేడు తెలుగునాట సర్వవ్యాపక మైనది. వ్యావ హారిక భాషావాదమునకు తమ యఖండప్రజ్ఞచే క్రొత్త గౌరవమును కల్పించినవారు కీ. శే. గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు. వీరి నిరంతరకృషివలననే నేడు వ్యవహారభాష గౌరవనీయమై పండిత పామరులచే సమానముగ వాడబడు చున్నది. వీరిని వ్యావహారిక భాషా బ్రహ్మ యని వర్ణించుట యసమంజసము కాదు. అప్పారావుగారు చక్కని కవిత్వమును కూడ రచించిరి. వీరు కవిత్వ వీధియందు కల్పించిన క్రొత్త పోకడలను భావకవిత్వ మను పేరుతో నేడు వ్యవహరించు చున్నాము. ఆంధ్రదేశమున నేడు ఖ్యాతి గాంచిన కవులలో పలువు రీ మార్గమునకు చెందినవారు. వీరిలో బసవరాజు అప్పారావుగారు, నండూరి సుబ్బారావుగారు మున్నగువారు ప్రముఖులు. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారును, శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు కూడ నూతన కవిత్వ పంథాలో చేరిన వారే కాని వీరి కవిత్వమందు జాతీయ భావము, విశిష్ట లక్షణ ముగ కాన్పించుచున్నది. వీరు పెక్కు కావ్యములను సమర్థ తతో రచించి ప్రఖ్యాతిగాంచి యున్నారు. దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారు, దువ్వూరి రామిరెడ్డిగారు, శ్రీ జాషువ కవిగారు మున్నగువారు నేటి తెలుగుసీమ నలంకరించుచున్న కవి ప్రముఖులు.

కవిత్వముతో పాటు యితర వాఙ్మయముకూడ ఆంధ్రమున నేడు వృద్ధినొందుచున్నది. నవలలు, చిన్నకథలు, హాస్యరచనలు, మున్నగునవి విరివిగ వృద్ధిచెందుచున్నవి. ఆంధ్రమున స్వతంత్రముగ నవలా రచన కావించినవారు తక్కువ. చాలవరకు ఇతర భాషలనుండి అనువాదములే కలవు. ఇట్టి అనువాదములను పెక్కింటిని మిక్కిలి సమర్థతతో నిర్వహించినవారు వేంకట పార్వతీశ్వర కవులు. వీరు సరసమగు కవిత్వమును కూడ రచించి యున్నారు. నేటి యుగమున వార్తాపత్రికల ప్రాముఖ్య మెంతయో నుండును. తెలుగునాట నేడెన్నియో వార్తాపత్రికలు గలవు. అందు కీ. శే. కాశీనాథుని నాగేశ్వర రావుగారి సంపాదకత్వమున చాలకాలము వర్ధిల్లిన ఆంధ్రపత్రికయు, ముట్నూరి కృష్ణారావుగారి యాజమాన్యమున వెడలుచున్న కృష్ణాపత్రికయు చిరకాలమునుండి ప్రచారములో నున్నవి. ఇవికాక మరెన్నియో పత్రికలు కూడ నేడు వెలువడుచున్నవి. హైదరాబాదు రాష్ట్రమునందు గోలకొండ, తెలంగాణము, మున్నగు పత్రికలు ప్రజాసేవ యందు నిమగ్నములై యున్నవి. ఆంధ్రు లాంగ్లభాషయందు కూడ కొన్ని పత్రికలను నడపియున్నారు. టంగుటూరి ప్రకాశంగారి సంపాదకత్వమున స్వరాజ్య పత్రికయు, డాక్టరు పట్టాభిగారి యాజమాన్యమున 'జన్మభూమి' పత్రికయు యెంతయో సమర్థతతో ప్రచారము గావించినవి. నేడు కోలవెన్ను రామకోటీశ్వరరావు

గారిచే నడుపబడుచున్న 'త్రివేణి' యను నాంగ్ల సంచిక యీనాటి ఉత్తమ పత్రికలలో చేర్పదగి యున్నది.

## ప్రా చీ న వి ద్య లు.

పాశ్చాత్య నాగరకతా సంపర్కము వలన ప్రాచీన భారతీయ విద్యల యందును, శాస్త్రముల యందును జన సామాన్యమునకు నేడు ఆదరము తగ్గినది. ఆ కారణమున నా విద్యలకు ప్రచారము కూడ తక్కువగ నున్నది. కాని ఇటీవల కలిగిన జాతీయ ప్రబోధము వలన మరల ప్రాచీనవిద్యల యెడ నించుక యాదరము చూపబడుచున్నది. దేశమందనేక ప్రాంతములలో వేదపాఠశాలలను, శాస్త్రసాహిత్యాదులను బోధించు విద్యాపీఠములును నెలకొల్పబడు చున్నవి. తిరుపతి యందును, కొవ్వూరు నందును, తెనాలి యందును నేడట్టి ప్రసిద్ధ విద్యాపీఠములు కలవు. చిరకాలమునుండి ఆంధ్రదేశము వేదాభ్యాసమునకు ప్రసిద్ధి గాంచియున్నది. నేటికిని కృష్ణా గోదావరీ తీరవాసులు ఘనాపాఠీలుగ పేరుమోసి యున్నారు. అట్లే శాస్త్ర విషయములందు కూడ ఆంధ్రులలో సమర్థులు పెక్కండ్రు గలరు. వేదార్థప్రతిపాదనమున ఆమ్నాయార్థవాచస్పతి యని పేరువడసిన వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారు, తర్కము నందు శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారు, వ్యాకరణము నందు మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారును ఇట్టి విద్వాంసులలో ప్రముఖులు.

## లలితకళలు.

లలితకళల యందుకూడ నేటి ఆంధ్రదేశము వెనుకపడి యుండలేదు. గానము, చిత్రలేఖనము, నృత్యము, నాట్యకళ మున్నగు వివిధ కళలు తెలుగుదేశములో వృద్ధినొందుచున్నవి. సంగీత పాఠశాలలు వివిధ ప్రాంతములలో నెలకొని యున్నవి. విజయనగరము నందు సంగీతము నేర్పుటకై యొక ప్రత్యేక కళాశాల స్థాపింపబడి యున్నది. గానకళా విశారదులు పలువురు ఆంధ్రులలో కలరు. తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారు, హరి నాగభూషణముగారు, ద్వారం వెంకటస్వామి నాయుడుగారు మున్నగువారు గానకళోపాసకులలో ప్రముఖులు. చిత్రకళయందు కూడ తెలుగువారిలో సమర్థులు పలువురు కలరు. కీ. శే. దామెర్ల రామారావుగారును, వారి సహాధ్యాయులును, మిత్రులునగు అడవి బాపిరాజుగారును ఆధునిక చిత్రకారులలో ప్రసిద్ధులు. చావలి నాగేశ్వరరావు కూడ చిత్రలేఖనము నందు ప్రసిద్ధులైన యాంధ్రులు. నృత్యమున కిటీవల మన దేశమునందు న్యూనత కల్పింపబడినందువలన అయ్యది కేవలం భోగకాంతల పరమై యుండెను. కాని నేటికిని కృష్ణాజిల్లా యందలి కూచిపూడి వాస్తవ్యులగు బ్రాహ్మణు లీ విద్యయందు సమర్థులై ప్రాచీనమైన యీ భారతీయ కళను సజీవముగ నుంచి యున్నారు. ఆంధ్ర మహాజనుల ప్రోత్సాహము వలన నీ విద్య ఇతోధికాభివృద్ధి పొందు నవకాశములు గలవు. ఆంధ్రదేశము

నందు నటకులలో గొప్ప ఖ్యాతి సంపాదించినవారు కలరు. రావుబహద్దర్ బళ్ళారి టి. రాఘవాచార్యులుగారు, స్థానం నరసింహారావుగారు, యడవల్లి సూర్యనారాయణగారు మున్నగువారు తెలుగు నటకులలో ప్రముఖులు. నాట్యకళకు రూపాంతరమైన సినీమా కళయందు కూడ ఆంధ్ర దేశీయులు చాల అభివృద్ధి కాంచి యున్నారు.

## తెలంగాణము - ప్రజాప్రబోధము

ఈ సందర్భమున నిజాము రాష్ట్రమునందలి ఆంధ్రప్రజలనుగూర్చి కొన్ని విషయములు పొందుపరచుట యావశ్యకము. ఈ రాష్ట్రములోని సగభాగము తెలంగాణాప్రాంతము. ఇందు సుమారు డెబ్బదిలక్షలప్రజలు నివసించుచున్నారు. భక్తాగ్రేసరుడైన బమ్మెర పోతరాజు, అమోఘవాక్సుద్ధి కల్గిన వేములవాడ భీమకవి, వేదాంతవిద్యాఖని యనదగిన పరశురామపంతుల లింగమూర్తికవియు, విద్వత్ప్రభువులగు కాకతీయరాజన్యులును, సర్వజ్ఞ సింగభూపతియు మున్నగు మహనీయులీ ప్రాంతమువారే. ఆంధ్రదేశమందలి యీ సుప్రసిద్ధభూభాగము కాల ప్రవాహమున తన యౌన్నత్యమును గోల్పోయి మిక్కిలి క్షీణదశకు వచ్చెను. ఇచ్చటి ఆంధ్రులు ఇతర ప్రాంతములయందలి యాంధ్రులకంటెకూడ వెనుకబడియుండుట తటస్థించెను. విహంగమాకాశయానమునే మరచినట్లు ఆంధ్రుడు తెలుగుభాషనే మరచునట్టి పరిస్థితులు ఏర్పడినవి. ఇట్టి పరిస్థితులలో ఇరువదవ

శతాబ్ది ప్రారంభమందు (1901) హైదరాబాదుపట్టణమున శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయము స్థాపింపబడెను. ఇది యిచ్చటి ఆంధ్రప్రబోధమునకు కోడికూతవంటిది. ఈ భాషానిలయము దేశమునందుత్సాహమును ప్రబోధమును కల్గించి యితర భాషానిలయముల స్థాపనకు కారణమయ్యెను. అట్టివానిలో హనుమకొండపురమందలి రాజరాజనరేంద్రభాషానిలయ మొకటి. క్రమముగా నిజామ్ఆంధ్రప్రాంతమందు వివిధ గ్రంథాలయములు స్థాపింపబడి భాషాభివృద్ధికిని, దేశాభివృద్ధికిని తోడగుచున్నవి. 1920 వ సంవత్సరము ప్రాంతములో ఇచ్చటి ఆంధ్రప్రముఖులు దేశాభివృద్ధికై ఆంధ్రకేంద్రసంఘమును స్థాపించి దేశీయులలో ప్రబోధమును, సంచలనమును కల్గించుటకై యెంతయో పాటుపడిరి. 1930 వ సంవత్సరమున ఆంధ్రమహాసభ స్థాపింపబడెను. ఈ మహాసభ ఇంచుమించు ప్రతిసంవత్సరమును సమావేశమై ప్రజాక్షేమమునకు సంబంధించిన అన్ని విషయములను చర్చించి, ప్రభుత్వము వారికి వినతులను పంపుచుండెను. ఈ మహాసభాసమావేశములవలన దేశీయులలో నెంతయో ప్రబోధము కల్గినదనుట నిర్వివాదాంశము. ఈ మహాసభ కాలానుగుణ్యముగా మార్పు చెందుచు, ప్రజావిశ్వాసమును చూరగొని వారి సేవయందు నిమగ్నమై యున్నది. నైజాము ఆంధ్రప్రజలయందు నేడు భావసంచలనమును, ప్రబోధమును కల్గించుటకు కారణభూతులైనవారిలో శ్రీ మాడపాటి హనుమంతరావుపంతులుగారు ప్రముఖులు.

నిస్స్వార్థమును, నిరాడంబరమునైన వీరిసేవ మిక్కిలి ప్రశంసాపాత్రము. ఇట్లే గోలకొండపత్రికకు సంపాదకులుగ గత పదునెనిమిది వత్సరములనుండియు పనిచేయుచున్న శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు దేశీయులలో చైతన్యమును కల్గించుటకై ఎంతయో పాటుపడినారు. రెడ్డిగారు పండితులు. బహుళ గ్రంథరచయితలు. నేటి యువకులలో కానవచ్చుచున్న గ్రంథరచనాసక్తికి శ్రీ రెడ్డిగారే వరవడి పెట్టినారనుట యతిశయోక్తి కానేరదు. వీరుకాక ఆంధ్రప్రముఖులు పలువురు నైజాము ఆంధ్రప్రజల సేవకై నిరంతరమును యత్నించుచున్నారు.

మైసూరురాష్ట్రమందును, తదితర ప్రాంతములయందునుకూడ పలువురు ఆంధ్రులు నివసించియున్నారు. వీరియందు కూడ కాలానుగుణ్యముగ నభివృద్ధిసూచనలు కానవచ్చుచున్నవి.

నేటి ఆంధ్రమహాజనులలో వారి పూర్వుల తేజమును, బుద్ధికౌశల్యమును చక్కగ ప్రకాశించుచున్నవి. ఇందులకు తోడు వారు పట్టుదలను, ఐకమత్యమును అలవరచుకొని దేశాభివృద్ధికై పాటుపడినయెడల ఆంధ్రుల చరిత్ర మరల మహోజ్జ్వలమై రాణింపగల్గుట నిస్సంశయము.

# ఆంధ్రుల చరిత్ర

## తుది పలుకు

ఈ చిన్ని పుస్తకము వ్రాసి సుమారు పదునొకండు సంవత్సరములు గడచినవి. ఈ దశాబ్దము భారతదేశ చరిత్రయందును, ఆంధ్రదేశ చరిత్రయందును కూడ మిక్కిలి ముఖ్యమైనది. ఈ పది సంవత్సరముల స్వల్పకాలములో జరిగిన మార్పులు సామాన్యముగ నొక శతాబ్దములో కూడ జరుగవని చెప్పవచ్చును. ఆ మార్పు లెట్టివో మనము గమనింతము.

### భారతదేశ స్వాతంత్ర్యము:

భారత జాతీయ మహాసభవారు మన దేశమునకు స్వపరిపాలనాధికారము కావలయునని చిరకాలము నుండి ఆందోళనము సల్పుచుండిరి. కాని బ్రిటీషు వారా కోరికను మన్నింపక, ఏవో కొన్ని సంస్కరణముల మాత్ర మమలు జరిపి, కాలము పుచ్చుచుండిరి. ఇది యిట్లుండగా 1939 వ సంవత్సరమున రెండవ ప్రపంచమహాసంగ్రామము ప్రారంభమయ్యెను. 1942 వ సంవత్సరము నాటికి బ్రిటీషు వారికి ప్రతిపక్షులైన జపానువారు విజృంభించి బర్మాను జయించి, హిందూ

దేశముపై దండెత్తి వచ్చుటకు సిద్ధపడుచుండిరి. ఇట్టి ప్రమాద పరిస్థితిలో భారత ప్రజల సంపూర్ణ సహకారము లేకుండ యుద్ధమును విజయవంతముగ కొనసాగించుట సాధ్యపడదని యెరింగి, ఆంగ్లేయులు భారతప్రజల స్వపరిపాలనా వాంఛను కొంతవరకైన తీర్పవలెనని నిశ్చయించుకొనిరి. కాంగ్రెసు నాయకుల తోడను, ఇతర భారతీయ ప్రముఖుల తోడను సంప్రతించుటకై సర్ స్టాఫర్డు క్రిప్సు అను ఆంగ్ల ప్రముఖుని బ్రిటీషుప్రభుత్వమువారు మనకడకు పంపిరి. కాని క్రిప్సు రాయబారము సఫలము కాలేదు. 1945 వ సంవత్సరమున జర్మనీ వారు ఓటమి నంగీకరించిన వెనుక, రాజప్రతినిధియైన వేవెల్ ప్రభువు భారత ప్రజా ప్రతినిధులతో మరల సంప్రతింపులు జరపెను. కాని ఇవి కూడ ఫలవంతములు కాలేదు. 1946 వ సంవత్సరమున బ్రిటను దేశపు ప్రభుత్వములో గొప్ప మార్పు సంభవించెను. ఎన్నికలలో బ్రిటీషు కార్మిక పక్షమునకు ఘనమైన విజయము లభించెను. తత్ఫలితముగ బ్రిటను దేశమున కార్మిక ప్రభుత్వ మేర్పడెను. ఈ పక్షమువారు భారత స్వాతంత్ర్యమునకు మొదటి నుండియు సుముఖులు. భారతీయుల స్వాతంత్ర్యవాంఛ నిక యణచివేయుట సాధ్యపడదని గుర్తించి, కార్మికపక్ష నాయకుడగు అట్లీ ఈ సమస్యను శాశ్వతముగ పరిష్కరించుటకై పూనుకొనెను. బ్రిటీషు ప్రభుత్వము పక్షమున నొక రాయబారవర్గము భారతదేశమును సందర్శించి భారత జాతీయ నాయకులతో సంప్రతింపులు జరపి, భారత

స్వపరిపాలనము కొరకై ఒక పథకమును సిద్ధపరచెను. కాని భారతీయ మహమ్మదీయులు తమకు ప్రత్యేకమగు స్వతంత్ర రాజ్యము కావలెనని పట్టుపట్టి నందున నీ పథకము విఫలమయ్యెను. తుదకు 1947 వ సంవత్సరమున బ్రిటీషు కార్మిక ప్రభుత్వమువారు, భారత స్వపరిపాలనమును గూర్చి తమ నిర్ణయమును ప్రకటించిరి. భారతదేశమును పాకిస్తానము, హిందూస్తానము అను రెండు భాగములుగ విభజించి, 15 ఆగస్టు 1947 నాడు ఆ రెండు ప్రభుత్వములకును అధికారము వశపరచి తాము నైదొలగ గలమని బ్రిటీషు ప్రభుత్వమువారు నిశ్చయించుకొనిరి. ఈ నిర్ణయమును వారు తు. చ. తప్పకుండ అమలు జరపిరి. భారతదేశము పాకిస్తానములతో పాటు భారతదేశమందలి వివిధ సంస్థానములకు కూడ సంపూర్ణ స్వాతంత్ర్యమొసంగబడెను. 1947 వ సంవత్సరము ఆగస్టు పదునేనవ తేదీని భారతదేశమునకు లభించినది అధినివేశ ప్రతిపత్తి మాత్రమే. సంపూర్ణ స్వాతంత్ర్యము కాంగ్రెసు మహాసభ వారి లక్ష్యము. కావున నూతన రాజ్యాంగ విధానము సిద్ధమైన వెనుక 26 జనవరి 1950 తేదీని భారతదేశము సంపూర్ణ స్వతంత్రమును ప్రకటించెను.

## ఆంధ్ర రాష్ట్ర స్థాపనము

ప్రత్యేకాంధ్రరాష్ట్రము కావలయునని ఆంధ్రులు 1913 నుండియు వాంఛించుచుండిరి. అఖిలభారతజాతీయమహాసభవారుకూడ భాషాప్రయుక్త రాష్ట్రముల నేర్పాటు కావిం

చుట సమంజసమని యంగీకరించుటయే కాక, తమ సంస్థయం దలి వ్యవస్థలో నీ సిద్ధాంతము నమలుకావించిరి. కొన్ని యితర ప్రాంతములవలెకాక, ఆంధ్రప్రజలు కాంగ్రెసునే నమ్ముకొని దేశమునకు స్వతంత్రము లభించుటతోడనే ప్రత్యేకాంధ్ర రాష్ట్రము సుకరముగ నెలకొల్పవచ్చునని విశ్వసించుచువచ్చిరి. కాని వీరి విశ్వాసము నిరాధారమని ముందుముందు తెలియ వచ్చెను. భారతస్వాతంత్ర్యము లభించిన తరువాత భారతప్రభు త్వమువారు ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణవిషయమున సుదా సీనతను, వైముఖ్యమునుకూడ చూపసాగిరి. భారతదేశమునకు స్వతంత్రము సిద్ధించిన తరువాత నూతన పరిస్థితు లేర్పడిన వనియు, ఈ నూతనపరిస్థితులలో భాషాప్రయుక్త రాష్ట్రముల నెలకొల్పుట అనావశ్యకమనియు, దానివలన దేశైక్యతకు భంగము వాటిల్లుననియు కాంగ్రెసు అగ్రనాయకులు పలుక సాగిరి. కాని యీవాదము ఆంధ్రప్రజలకు నచ్చలేదు. అంతట కాంగ్రెసుసభవారు జవహర్లాలు నెహ్రూ, సర్దారు పటేలు, పట్టాభి సీతారామయ్యగార్లతో కూడిన ఒక ఉపసంఘము నేర్పాటుచేసి ప్రత్యేకాంధ్రరాష్ట్రసమస్యను పరిష్కరింపవలసి నదిగా కోరిరి. ఈ సంఘమువారొక పథకమును సిద్ధపరచి ఆం ధ్రులు మద్రాసునగరముపై తమకెట్టిహక్కును లేదని యంగీక రించినపక్షమున ప్రత్యేకాంధ్రరాష్ట్రము నేర్పరుతు మని ప్రక టించిరి. ఈ యపూర్వనిర్ణయమునుకూడ అంగీకరించుట కాంధ్రప్రజలు సంసిద్ధులగుచుండిరి. కాని భారతప్రభుత్వము

నా లేకారణమువలననో మరల యీ సమస్యను వెనుకకు నెట్టి ఆంధ్రప్రజాభిప్రాయము నెడ నిర్లక్ష్యత చూపసాగిరి. ఆంధ్ర ప్రజలయందు నిరాశాభావము ప్రబలెను. మొట్టమొదటనుం డియు కాంగ్రెసునే నమ్ముకొనియున్న తమకన్యాయము జరిగిన దని ఆంధ్రప్రజలు భావింపసాగిరి. ప్రత్యేకాంధ్రరాష్ట్రస్థాపన విషయమున భారతప్రభుత్వమువా రవలంబించుచున్న నీతిని నిరసించుటకై 1952 వ సంవత్సరప్రారంభమున ప్రసిద్ధజాతీయ వాదియగు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు (స్వామీ సీతారాం) సుమారు నలుబదిదినములు నిరశనవ్రతము పూనిరి. ఇందలిసౌజన్యమును గుర్తింపకపోవుటయేకాక, భారతప్రభు త్వమువారు తామిట్టి బెదరింపులకు లొంగిపోమని సమాధాన మిచ్చిరి. తుదకు 1952 వ సంవత్సరము అక్టోబరు నెలలో శ్రీ పొట్టి శ్రీరాములుగారు ఆంధ్రరాష్ట్రస్థాపనముకొరకై నిర శనవ్రతము ప్రారంభించిరి. ఈ ప్రాయోపవేశ మేబదిదినములు పైబడి సాగెను. ఈ కాలములో మద్రాసుప్రభుత్వమువారును, భారతప్రభుత్వమువారునుకూడ విదేశీయులగు బ్రిటీషువారు కూడ పూనని కర్కశత్వమును వహించి ఆంధ్రప్రజావాంఛితము నీడేర్పరైరి. తుదకు 1952 వ సంవత్సరము 15 డిసెంబరునాడు మహావీరుడైన పొట్టి శ్రీరాములుగారు ఆంధ్రరాష్ట్రనిర్మా ణముకొరకై ప్రాణములవిడచిరి. శ్రీరాములుగారి నిర్యాణము ఆంధ్రప్రజల కమితమగుసంతాపమును, కోపమును కల్గించెను. ఆంధ్రదేశమున చాల అశాంతి చెలరేగెను. ప్రజాభిప్రాయ

మును తిరస్కరించుటకిక సావకాశము లేదని గుర్తించి భారత ప్రభుత్వమువారు 1953 అక్టోబరు నెల ప్రారంభమున తాము ప్రత్యేకాంధ్రరాష్ట్రమును నెలకొల్పుదుమనియు, అందు ఉత్తర సర్కారుజిల్లాలును, రాయలసీమజిల్లాలుమాత్రమే చేరుననియు మద్రాసునగరమునుమాత్ర మందు చేర్పమనియు ప్రకటించిరి. ఈ ప్రకటనముప్రకారము కర్నూలు రాజధానిగా ప్రత్యేకాంధ్రరాష్ట్ర మవతరించెను. ఆంధ్రరాష్ట్రముయొక్క ప్రధాన న్యాయస్థానము గుంటూరునగరమున నెలకొన్నది.

## ఆంధ్రరాష్ట్రములో అభివృద్ధి

ప్రత్యేకాంధ్రరాష్ట్రమేర్పడి నేటికి రెండుసంవత్సరముల కాలము గడచినది. కాని యీ స్వల్పకాలములోనే యీ రాష్ట్రము చక్కనిఅభివృద్ధి కాంచగల్గినది. నేడాంధ్రరాష్ట్రమునకు గవర్నరుగా నున్న శ్రీ చందూలాల్ త్రివేదిగారు అత్యంతసమర్థులైన పరిపాలకులు. ఈరాష్ట్రమునకు ప్రథమ ముఖ్యమంత్రిగనుండిన శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు గొప్ప దేశభక్తులు. 1955 వ సంవత్సరప్రారంభమున జరిగిన ఎన్నికలలో ఆంధ్రరాష్ట్రమున సుస్థిరమగు ప్రభుత్వము నెలకొనినది. తరుణులును, ఉత్సాహపూరితులును అగు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి యాజమాన్యమున నాంధ్రప్రభుత్వము తన ధర్మములను జయప్రదముగ నెరవేర్చుచున్నది. ఆంధ్ర ప్రభుత్వమువారనేక అభివృద్ధిప్రణాళికలను చేపట్టియున్నారు.

ప్రకాశంమంత్రివర్గమువారు తిరుపతిపట్టణమున శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయమును నెలకొల్పియున్నారు. ఇయ్యది ముఖ్యముగ ప్రాచ్యవిద్యలను, సంస్కృతిని అభివృద్ధి పొందించగల కేంద్రముగ విలసిల్లగలదని మన మూసింపవచ్చును. 10 వ డిసెంబరు 1955 నాడు భారతప్రధానియైన శ్రీ జవహర్లాల్ నెహ్రూ గారు నాగార్జునసాగరపు టానకట్టకు శంకుస్థాపనము కావించి యున్నారు. గుంటూరుజిల్లాలోని మాచెర్లకు సుమారు పది మైళ్ళదూరముననున్న నందికొండ గ్రామమువద్ద కృష్ణానదిపై ఒక బ్రహ్మాండమగు ఆనకట్టను నిర్మించుట ఈ పథకముయొక్క ముఖ్యోద్దేశము. ఈ పథకము పూర్తియగుటకు పదిసంవత్సరములకాలము పట్టును. దీనికొరకై సుమారు 130 కోట్లరూపాయలు వ్యయపడును. ఈ ప్రాజెక్టునిర్మాణము పూర్తియగుసరికి బ్రహ్మాండమగు నాగార్జునసాగరతటాక మేర్పడును. దీనినుండి వెల్వడు కాల్వలు 400 మైళ్ళకుపైబడి వ్యాపించును. కృష్ణానది ఉత్తరముననున్న తెలంగాణప్రాంతమందును, దక్షిణముననున్న కృష్ణ, గుంటూరు, నెల్లూరుమండలములందును గల ముప్పది లక్షలయెకరములభూమి యీ కాలువవలన సాగుబడియగును. కృష్ణ కెడమవైపున నొక విద్యుచ్ఛక్తి కేంద్రము నెలకొనును. ఇందు 75000 కిల్లోవాట్ల విద్యుచ్ఛక్తి యుత్పన్నమై దేశాభ్యున్నతి కనేకవిధముల తోడ్పడగలదు. విశాఖపట్టణముకడనున్న రేవుప్రదేశము (హార్బరు) నభివృద్ధిచేయుటకును, ఇచ్చటగల నౌకానిర్మాణకేంద్రమును విస్తృతపరచుటకును కేంద్రప్రభు

త్వమువారు పూనుకొనియున్నారు. ఆంధ్రరాష్ట్ర మేర్పడుట తోడనే బెజవాడవద్దగల కృష్ణయానకట్టను బాగుచేసి బలపర చుటకును, దానిపై బండ్లును, మనుష్యులును రాకపోకలు జరు పుట కనువైన యొక చక్కని వంతెనను నిర్మించుటకును ఏర్పాట్లు చేయబడినవి. దానికి సంబంధించిన కార్యకలాప మిప్పుడు చురుకుగ సాగుచున్నది. ఈ వంతెన పూర్తియైన యెడల కృష్ణా, గుంటూరుజిల్లాలను కలుపు రాచబాట యేర్ప డును. అట్లే తూర్పుగోదావరిజిల్లాయందు గోదావరినదిపై యొకమహాత్తరమగువంతెన నిర్మించుటకు ప్రయత్నములు సాగు చున్నవి. ఆంధ్రరాష్ట్ర మేర్పడుటకు పూర్వమే తుంగభద్రా నదిపై యొక గొప్ప ఆనకట్ట నిర్మింపబడినది. 1953 వ సంవ త్సరము జూలై నెలయందీ ఆనకట్ట కాల్వలలోనికి నీరు వదలి నారు. ఆనకట్టనిర్మాణము పూర్తియైనది. కాని కాలువలు, విద్యుచ్ఛక్తి కేంద్రములకు సంబంధించిన పని యింకను సాగు చున్నది. ఈ ఆనకట్ట మల్లాపురమను గ్రామము (బళ్ళారి జిల్లా) వద్ద నిర్మింపబడినది. దీనినుండి సుమారు 400 మైళ్ళపొడవుగల కాల్వలు వెల్వడును. ఈ కాలువల నీరువలన హైద్రాబాదు రాష్ట్రము, ఆంధ్రరాష్ట్రములోని రాయలసీమ జిల్లాలలోని సుమారు ఎనిమిదిలక్షల యెకరముల భూమికి నీటిపారుదలసౌక ర్యము లేర్పడును. విద్యుచ్ఛక్తి ఒకలక్ష పదివేల కిలోవాట్లు వరకును ఉత్పత్తియగును. ఈ విధముగ నాంధ్రరాష్ట్ర మన్ని రంగములయందును అభివృద్ధి కావించుచు పురోగామిగనున్నది.

## హైద్రాబాదు రాష్ట్రము — పోలీసుచర్య:

నేటి హైద్రాబాదు రాష్ట్రములో ఎనిమిది తెలుగు జిల్లాలు కలవు. వీనిని తెలంగాణ మనుపేర వ్యవహరించు చున్నాము. ఆంధ్రదేశము యొక్క చరిత్రను చదువు నప్పు డీ తెనుగుజిల్లాల యందలి విశేషములను కూడ తెలిసికొనుట మన విధి. 1947 వ సంవత్సరమున భారతదేశమునకు స్వాతంత్రము సిద్ధించిన సందర్భమున వివిధ స్వదేశ సంస్థానములకు కూడ సంపూర్ణ స్వాతంత్ర్య మొసంగబడిన ట్లీవరకే తెలుపబడి యున్నది. కాని భారతదేశ మందలి యితర స్వదేశ సంస్థానము లన్నియు కేంద్ర ప్రభుత్వముతో నొడంబడికలు చేసికొని భారత సమాఖ్యలో సభ్యులుగ చేరెను. కాని హైదాబాదు రాష్ట్రమును పాలించుచున్న నిజాము నవాబు మాత్ర మందుల కంగీకరింపక తాను స్వతంత్రుడుగ నుండదలచినట్లు ప్రకటించెను. హైదాబాదు రాష్ట్రమును భారత యూనియనులో చేర్చుటకై కేంద్ర ప్రభుత్వమువారు విశ్వప్రయత్నము చేసిరి. కాని యీ కృషియంతయు నిరర్థక మయ్యెను. ఇది యిట్లుండగా హైదాబాదు రాష్ట్రములోని హిందువుల నెల్ల వెడల నడచి, వారి స్థానమున మహమ్మదీయులను రావించి, యీ రాష్ట్రమును మహమ్మదీయులకు కేంద్రముగ కావించుటకై నిజాము నవాబు అనుచరులు గట్టి ప్రయత్నము సల్పిరి. ఈ సందర్భములో "రజాకార్లు" అను దుండగులు నిరపరాధులగు హిందువులను పెట్టిన బాధలు వర్ణనాతీతములు. ఒక సంవత్సరము

కాలము హైదారాబాదు రాష్ట్రమున తీవ్రమగు అశాంతి చెల రేగెను. భారతప్రభుత్వము వారీ స్థితిగతులను కొంత కాలము పాటు చూచియు చూడనట్లుండి సహించిరి. కాని 1948 వ సంవత్సరమున పరిస్థితులు విషమించెను. హైద్రాబాదు రాష్ట్ర మున నల్లకల్లోలము వ్యాపించెను. అంతట భారతప్రభుత్వము వారు 1948 సెప్టెంబరు నెలలో తమ సేనలను హైదారాబాదు రాష్ట్రముపై బంపి రాష్ట్ర ప్రభుత్వమును వశపరచుకొనిరి. దీనినే మనము పోలీసుచర్య యని వర్ణించుచున్నాము. అనతి కాలములో స్థితిగతులు చక్కబడెను. 1951 వ సంవత్సరమున హైద్రాబాదు రాష్ట్రములో కూడ ఎన్నికలు జరిగి ప్రజా ప్రతినిధి ప్రభుత్వ మేర్పడెను. హైదారాబాదు రాష్ట్రము తెలుగు, మహారాష్ట్ర, కన్నడ ప్రజలతో కూడిన త్రిభాషా ప్రాంతము. ఇట్టి రాష్ట్రమునకు ఆంధ్ర ప్రముఖుడగు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రిగ నుండుట ఆంధ్రుల యదృష్టమనియు, ఈ రాష్ట్ర ప్రజల యన్యోన్య మైత్రికి తార్కాణమనియు భావింపవలెను.

## రా ష్ట్ర పు న ర్ని ర్మా ణ ము :

ప్రత్యేకాంధ్ర రాష్ట్ర మేర్పడిన వెనుక భాషాప్రయుక్త రాష్ట్ర సమస్యను గూర్చి కేంద్ర ప్రభుత్వమువారి యభిప్రాయ ములు కొంతవరకు మారెను. భారతదేశ మందలి వివిధరాష్ట్ర ముల నిర్మాణములో కొన్ని మార్పు లవసరమని వారంగీకరిం

చిరి. కాని రాష్ట్ర పునర్నిర్మాణమునకై భాషను మాత్రమే కాక, ఇతర ముఖ్య విషయములను కూడ అనగా పరిపాలనా సౌకర్యము, ఆర్థిక సౌష్ఠవము, దేశక్షేమము మున్నగు నంశ ములను కూడ దృష్టియం దుంచుకొనవలె నని వారభిప్రాయ పడిరి. మిక్కిలి క్లిష్టమగు రాష్ట్ర పునర్నిర్మాణ సమస్యను సమగ్రముగ పరిశీలించి తమ యభిప్రాయమును తెలుపవలసి నదిగా వీరొక ప్రత్యేక సంఘమువారి కాదేశ మొసంగిరి. (1953) ఈ సంఘమునకు ఫజల్ అలీ అనువారు అధ్యక్షులు. పండిత హృదయనాథ కుంజ్రూ, సర్దార్ పణిక్కరుగార్లు సభ్యులు. వీరు రాష్ట్ర పునర్నిర్మాణ సమస్యను శాంతముగ విమర్శించి తమ నివేదికను 1955 వ సంవత్సరము సెప్టెంబరు నెలయందు భారతప్రభుత్వము వారికి సమర్పించిరి. ఇందు కావింపబడిన సిఫారసులు తీవ్రవివాదముల కాస్పదమైనవి. హైదరాబాదు రాష్ట్రమునకు సంబంధించి నంతవరకు వారీ క్రింది సిఫారసులను కావించిరి: "హైద్రాబాదు రాష్ట్రమును తెలంగాణము, మహారాష్ట్ర ప్రాంతము, కన్నడ ప్రాంతము, అను మూడు భాగములుగ వేరుచేసి మహారాష్ట్ర, కన్నడ జిల్లాల నాయా ప్రాంతములలో నేర్పడియున్న యితర రాష్ట్ర ములలో కలిపివేయవలెను. తెలంగాణమును మాత్రము 1961 వరకును ప్రత్యేక రాష్ట్రముగ నుండనిచ్చి, అప్పుడు తెలంగాణా ప్రజ లంగీకరించిన పక్షమున దాని నాంధ్రరాష్ట్రముతో చేర్చి విశాలాంధ్ర రాష్ట్రమును నిర్మింపవలెను. విశాలాంధ్ర రాష్ట్ర

మునకు హైదరాబాదు నగరము రాజధానిగ నుండవలెను." ఈ సిఫారసులను ఆంధ్ర రాష్ట్రపు ప్రభుత్వమును, ప్రజలును, సంతసముతో నంగీకరించిరి. విశాలాంధ్ర రాష్ట్ర నిర్మాణమున కితరాంధ్ర ప్రజలు మొదటి నుండియు సుముఖులుగనే యున్నారు. కాని తెలంగాణా ప్రజలలో కొందరీ యుద్యమము నకు విముఖులు. తెలంగాణా ప్రాంతము ప్రత్యేక రాష్ట్రముగ నుండవలెనని వారి వాదము. రాష్ట్ర పునర్నిర్మాణ సంఘము వారి సిఫారసులు వెలువడిన తరువాత విశాలాంధ్ర, తెలంగాణా పక్షములకు గల విభేదములు తీవ్రతరము లైనవి. భారత ప్రభుత్వమువారు మాత్రము విశాలాంధ్ర నిర్మాణము వైపే మొగ్గుచున్నట్లు కాన్పించుచున్నది. క్లిష్టమగు నీ సమస్య ఇప్పుడెట్లు పరిష్కారమగునో తెల్పుటకు వలను పడదు. కాని అనతికాలములో నాంధ్రమహాజను లెల్లరు నేకమై విశాలాంధ్ర రాష్ట్రమును నిర్మింతురనుట కెట్టి సందేహమును లేదు. ఆంధ్ర దేశము వర్ధిల్లుగాక.



మెజస్టిక్ ప్రెస్, రాజమండ్రి.

